కా మ దే వా య న మః

# చంద్రరేఖా విలాపము.

శ్రీ॥ శ్రీ॥ కూచిమంచి జగ్గకవి చంద్ర

ప్రణీతంబైన హాస్యరస

ప్రబంధరాజము.

"క॥ పది నీతులు పది బూఁతులు
పది శృంగారములు గల్గు ♦ పద్యములు సభన్
జదివిన వాఁడే యధికుఁడు
గదరప్పా కుందవరపు ♦ గవి చౌడప్పా!"

**1931**

చందాదారులకుమాత్రమే

మూల్యము రూ **1—8—0**

# తొలిపలుకు



భాషాభిమానులారా!

భాషామతల్లికి ప్రబంధగ్రంథరాజములు తేజోవంతములగు ముత్యాలసరులవలె విరాజిల్లుచుండును. అందు శృంగార గ్రంథములు మిసమిసలాడు కొలికిపూసలలు. అట్టికొలికిపూసలలో చంద్రరేఖావిలాపము 'ఆణిముత్యము వంటిది. దీనిని కవిసార్వభౌమ' కూచిమంచి తిమ్మన్న కవీంద్రుని తమ్ముడు జగ్గన కవిచంద్రుడు రచియించెను.

పావన గౌతమీ తీర పరిసరంబున గల పీఠికాపురంబున, ఆపస్తంబసూత్ర, కౌండిన్యగోత్ర కూచిమంచి గంగనామాత్యునకు సుమారు క్రీ. 1700 సంవత్సర ప్రాంతమునందీ జగ్గకవి జన్మించెను. తిమ్మకవి సింగనామాత్యులీతని కగ్రజన్ములు.

ఈ కవిచంద్రుడు జానకీ పరిణయమును, నర్మదాపరిణయమును, రాధాకథాసుధానిధానమును, సుభద్రాపరిణయమును, ఉమాసంహితమును, వివిధ దండకములును, బహుశతకములును, గీతప్రబంధములును, ఖడ్గాది బంధములును రచియించెను.

విజయనగర సంస్థానాధిపతులగు శ్రీశ్రీశ్రీ పూసపాటి విజయరామరాజుగారి చెల్లెలి భర్తయగు చింతలపాటి నీలాద్రిరాజుగారి యుంపుడుకత్తెయగు చంద్రరేఖ యను వేశ్యను నాయికగా జేసి నీలాద్రిరాజుగారిమీద నీ ప్రబంధము నీకవి రచియించెను.

డాలోక కాలాన ♦ లాభీల విస్ఫుర
న్నేత్రతుండము ఖడ్గస ♦ న్నిభనిశాత
గీ॥ నఖరుడు హిరణ్యకశిపుని ♦ నాశకుండు
సింహగిరి వర్తియగు నర ♦ సింహమూర్తి
యడరు చింతలపాటి నీ ♦ లాద్రినృపుని
సిరియుఁ గర్వం బడఁగఁగఁ ♦ జేయుఁ గాత॥ 3

ఉ॥ నీరదనీలవర్ణుఁడు శు ♦ నీవరవాహుఁడు విద్యుదాభవి
స్ఫారజటాభరుండు సహ ♦ శష్పసమన్వితదీర్ఘమేఢ్రుఁ డం
భోరుహగర్భమస్తక వి ♦ భూషితహస్తసరోజుఁ డామహా
భైరవుఁ డిచ్చుఁగాత నశు ♦ భంబులు నీలనృపాలమౌళికిన్॥ 4

చ॥ అనుపమవిక్రమక్రమ స ♦ హస్రభుజార్గళ భాసమానసా
ధనజిత సిద్ధసాధ్యసుర ♦ దానవదక్షుఁడు దక్షశీర్షఖం
డనుఁడగు వీరభద్రుఁడు గ ♦ డంకను జింతలపాటి నీలభూ
జనపతిపుంగవు న్విభవ ♦ సారవిహీనునిగా నొనర్చుతన్॥ 5

చ॥ సలువగు రక్తమాల్యవస ♦ నంబులు డంబుగఁ దాల్చి కన్నులన్
జలజలబాష్పబిందువులు ♦ జాలుకొనంగఁ జెలంగుచుండు న
క్కలుముల చేడెయక్క కల ♦ కాలము నీలనృపాలువింటిలోఁ
గలిపురుషానుషంగయయి ♦ గాఢరతి న్నటియించు గావుతన్॥ 6

చ. అనుదినవక్రమార్గగతు ♦ లై చరియించుచు వైరివర్గముల్
దనరఁ బరస్పరాత్మగను ♦ దాలిచి మంగళుఁడు న్గురుండునున్
శనియును రాహువు న్మిగుల ♦ సమ్మతి ద్వాదశజన్మరాసులన్
గొనకొని నిల్చి నీలనృప ♦ కుంజరుని న్గడతేర్తురెంతయున్. 7

క. భీమకవి రామలింగని
స్త్రీమన్మథుఁడై చెలఁగు ♦ శ్రీనాథకవిన్

రామకవి ముఖ్యులను బోఁ
ద్రామగతిం జిత్తవీథిఁ ♦ దలచి కడంకన్. 8

వ. ఇట్లు సకల దేవతాప్రార్థనంబును సుకవి జనతాభివందనం
బును గావించి యే నొక్క హాస్యరసపరిధానమగు ప్రబంధంబు సుకవి
నికరమనోనురాగ సంధాయకంబుగా రచియింప నుద్యోగించి యున్న
సమయంబున. 9

సీ. తన యుపకృతి మా ♦ ద్యత్కృష్ణకోటికి
గురుతర రాజాండంబు ♦ గూఁడు గాఁగ
తన లోభగుణవిమా ♦ తన దురాలభలత
కష్టదిశల్ ప్రమాకు ♦ లై చెలంగ
తన సందతనము ♦ ఘనతి మోవితతికే
బహుగృహంబులు శైల ♦ గుహలు గాఁగ
తనదు జారత్వదో ♦ రునను సంకరశర్మ
నాటకం బర్థాంజ ♦ నంబు గాఁగ

గీ. నవని దీపించుఁ జంద్రరే ♦ ఖాభిధాన
వారనారీత్రికోణ సం ♦ వర్ధమాన
రసపరిప్లుత సుఖగదా ♦ వర్ణకిరాంక
భూషణుం డైన నీలాద్రి ♦ భూమిపుండు. 10

వ. వెండియు నఖండ భూమండల మండనాయమాన మానవాధినాథ
సాధుయూథ నిర్నిరోధావరోధ సభాభవనాభ్యంతర నితాంత
వర్ణనీయ కాలకూటకాకకజ్జలఖంజరీటకంబళేంగాలకాలమార్జాల
గండోపలఘనాఘనగంధేభ బర్బరకదంబ సంభాసమానానూనాం
తదిగంతాక్రాంతాపయశోమండలుండును, సుభగుండును
మైరావణ రావణ కుంభకర్ణ కుంభనికుంభ శుంభనిశుంభ జంభ
హిడింబ ప్రలంబపౌలోమ బకవత్సక బాణచాణూర ఘటోత్కచ

కాలనేమి ఖరదూషణ త్రిశిర మారీచ మాలిసుమాలి మకరాక్ష ధూమ్రాక్ష శోణితాక్ష ప్రముఖరక్షోదక్ష సదృక్షుండ్ర నిర్నిద్ర ద్రాఘిష్ఠదుర్గమ మర్గుణాధ్యక్షుండును, సర్వావలక్షణుండును, కిరాతగుణగరిష్ఠుండును, దుర్మార్గ ప్రవీణాస్పదుండును, బ్రాహ్మణ ద్రవ్యభక్షణదక్షితుండును, బాలగండాసమాకర్ణనకుతూహలుండును, నిరంతరానంత దుర్దాంత ప్రాంతకాంతారాంతరాళకరాళమార్గానర్గళ సంచరద్గవయగోమాయు గోపుచ్ఛకురంగ శశమర్కటోలూక గ్రామసూకరప్రముఖ ప్రకట మృగయా విహార విశారదుండును, మహోన్మాదుండును, సుకవినికురంబ విద్వత్కదంబవందిసందోహ వైణికశ్రేణికా మనోరథార్థ వ్యర్థీకరణాసంహారణాకారణా నిర్దయస్వాంతుండును, నిగతశాంతుండును, బహువారనారీ జనాలింగన దుర్గంధబంధుర భగచుంబన తాడనపీడన దంతక్షత నఖక్షత మహిషమార్జాల మర్కట కుక్కుట కుక్కురప్రముఖ బంధనైపుణీగుణగరిష్ఠుండును, దుర్జన శ్రేష్ఠుండును, శ్రీమచ్చింతలపాటి వంశపారావార ఘోరజాజ్వల్యమానానూన శిఖాసందోహ సందీప్త బడబానలుండును, చలచిత్తుండును, సంగరాంగణభీరుండును, విషయ శూరుండును, నీచపాచ కాధారుండును పరమదుర్బల దుర్బరశరీరుండును, ఆత్మీయదాసవిలాసినీజన మనోధనపశ్యతోహారుండును, పతయాఘుండును, నగు నీలాద్రిరాజన్య పుంగవుం డొక్కనాఁడు.

సీ॥ వేటవేపులు పది • వేలు మచ్చికమీఱ
మూతినాకుచు దండ • మొఱఁగుచుండ
ఓమ్మ్రు తప్పెట లూని • క్రమ్మ రసాలాలు
జోహారనుమ వేట • సొంపు దెలుపఁ
దురకనేస్తలు సురా • పరిమళం బెసగంగ,
జెవిచెంత మనవులఁ • జెప్పుచుండ

రసపోషకు లడర వా ♦ రస్త్రీలు ముంగలఁ
దాఢై యటంచు నృ ♦ త్యంబుసలుప
గీ॥ వినయ మెసఁగంగఁ గుంటెన ♦ పనులు సేయు
సేవకులు దాసికలు డాసి ♦ క్రేవనిలువ
నలరు కొప్పాక గ్రామ సిం ♦ హాసనమునఁ
గడఁక దభు గొత్తఁ బేరోల ♦ గమునుండి॥ 12

మ॥ సరసాగ్రేసరుఁ గూచిమంచికుల ♦ భాస్వద్వార్ధిరాకావిధుఙ్
జిరకీర్తిఙ్ బహుళాంధ్రలక్షణవిదుఙ్ ♦ శ్రీమజ్జగన్నాథ సు
స్థిరకారుణ్యకటాక్ష లబ్ధకవితా ♦ ధీయుక్తునిఙ్ జగ్గరా
డ్వరనామాంకితునన్నుఁ జూచిపలికెఙ్ ♦ వాల్లభ్యలీలాగతిన్॥ 13

సీ॥ రచియించితివి మున్ను ♦ రసికులౌనని మెచ్చ
సురుచిర జానకీ ♦ పరిణయంబు
వచియించితివి కవి ♦ వ్రాతము ల్పొగడంగ
ద్విపద రాధాకృష్ణ ♦ దివ్యచరిత
ముచ్చరించితివి వి ♦ ద్వచ్చయంబు నుతింపఁ
జాటుప్రబంధముల్ ♦ శతకములును
వడి ఘటించితి విరు ♦ వదిరెండు వర్ణనల్
రాణింపఁగా సుభ ♦ ద్రావివాహ
గీ॥ మాంధ్రలక్షణ లక్ష్యంబు ♦ లరసినావు;
భూరిరాజన్య సంపత్ప్రి ♦ పూజితుఁడవు;
భళిర! నీభాగ్యమహిమ చె ♦ ప్పంగదరమె?
జగ్గరాజకవీంద్ర! వా ♦ చాఫణీంద్ర! 14

ఉ॥ అర్ణవమేఖలంగల మ ♦ హాకవికోటులలోన నెంతయున్
బూర్ణుఁడవీవు సత్కవిత ♦ బూతులరీతుల గోరుకొండగా

వర్ణనసేయ నేరుతువు ♦ వాలెముఁజల్కఁగ బల్కు మూర్ఖులన్
దూర్ణమె తిట్టిచంపుదువు ♦ ధూర్తవు, పౌరుషశాలివెంతయున్
నిర్ణయ మిత్తెఱంగెఱిఁగి ♦ నేర్పుననిన్ను బహూకరించిరన్
స్వర్ణవిభూషణాంబర గ ♦ జధ్వజచామరగోధనాశ్వదు
ర్వర్ణవిచిత్రపాత్ర బహు ♦ రాజ్యరమారమణీయపుత్ర సం
కీర్ణసమస్తవస్తు వర ♦ గేహ సమంచిత భోగభాగ్యముల్
కర్ణసమానదానము, న ♦ ఖండపరాక్రమశక్తి, నిత్యదృ
క్కర్ణ కులీనవాగ్విభవ ♦ గౌరవ, మాశ్రితబంధురక్షణో
దీర్ణకృపారసంబును, న ♦ తిస్థిరబుద్ధి, చిరాయువున్, సుధా
వర్ణయశంబును న్గలిగి ♦ వర్థిలఁజేతువు జగ్గసత్కవీ॥ 15

వ॥ అని యనేకప్రకారంబులం గొనియాడి యీడులేని వేడుకం జంద్రరేఖాభిధాన వారవారణరాజయాన యూరుప్రదేశంబున శిరంబు మోపిపరుండి క్రిందుచూచుచు నారాజాత్మజుండిట్లనియె. 16

క॥ వేంకటశాస్త్రిలు మాకు న
లంకారగ్రంథ మొకటి ♦ లలి సురభాషన్
బంకించె నాంధ్రకావ్యం
బంకిత మొనరింపుమీవు ♦ నట్లనె మాకున్॥ 17

క॥ అని మున్ను సత్ప్రబంధం
బొనరింపుమటంచుఁ జెప్పి ♦ యుంటిమి వెస న
ట్లనె రసముగఁజెప్పితి వది
గొన నిపుడు ధనంబులేమి ♦ కొదువలభించెన్॥ 18

సీ॥ వినుమదియెట్లన ♦ మనుజులు నామీదఁ
బిట్టుగఁ జలమూని ♦ విజయరామ
ధరణీశుతోఁ జెప్ప ♦ దండుగ పన్నెండు
వేల రూపాయలు ♦ వేగఁగొనియె

నిచ్చాపురంబులో ♦ నేనొక్కలంజతో
భోగించి నిద్దుర ♦ బోవఁ జోరు
తెలమి డేరాఁజొచ్చి ♦ బలువైన గుఱ్ఱంబు
వెండిపల్లముఁ బది ♦ వేల్వరాల

గీ॥ సొమ్ము దొంగిలిపోయిరి ♦ సొమ్ముపక్కి
సాటిదేశంబు రాయభూ ♦ షణుఁడు ద్రొబ్బె
దప్పె భాగ్యంబు నిర్భాగ్య ♦ దశ లభించెఁ
దవిలి సత్కృతిఁగొనఁ బదా ♦ ర్థంబులేదు॥ 19

వ॥ అదియునుంగాక. 20

తే॥ గీ॥ సత్కృతులు మున్న రాజుల ♦ సంఖ్యగాఁగ
నందె, రవియెల్ల జగతి నం ♦ దంద యణఁగె;
ఘనత జగదేకవిఖ్యాతి ♦ గలుగదయ్యె
వ్యర్థమయ్యెఁ బదార్థంబు ♦ వారిదెల్ల॥ 21

క॥ అపకీర్తియుఁ గీర్తియు భువి
నెపుడుంబోకుండుఁ, గీర్తి ♦ కియ్యఁగ వలయున్
విపులముగ ధనము, మాకిపు
డుపకారము గాఁగ జెప్పు ♦ మొకకృతి సరగన్॥ 22

క॥ చెప్పెదము హాస్యరసముగ
గుప్పున మున్దెవరుఁ జెప్పు ♦ కొన వినవిది గా
నిప్పుడు నాకును నొప్పుల
కుప్పకు నీ చంద్రరేఖ ♦ కును ముదమొదవన్॥ 23

క॥ గంగిసుమీ మును పేరున;
భృంగిసుమీ నాట్యకలనఁ ♦ బేర్కొనమరుసా
రంగిసుమీ దీనమ్మను
డెంగిసుమీ కామరతుల ♦ దిట్టఁడనె తిక్కా॥ 24

తే॥ గీ॥ వారకన్యకయని సీవు ♦ కేరవలదు,
దీనితో నాకునేస్తంబు ♦ పూనఁజేసి
కడకన్నెనె నాడిమళ్ళ వేంక ♦ కటమనీషి
దీనితల్లిని వినయించు దృష్టికలన॥ 25

క. బోగమువారందఱు న
చ్చో గుంభన మెసఁగ వచ్చి ♦ చూడఁగ, నతోఁడా
యాగాయతనము లో సం
యోగము గావింపఁజేసె ♦ నొగి నిర్భరకుప్ 26

క. అతనికిఁ గూఁతురగుటఁ
జాతుర్య మెలర్ప నేర్పె ♦ చౌశీతిగతుల్
ఖ్యాతిగ నిది నా మదికిఁ
జేతస్సంజాతసుమవి ♦ శిఖమైనాళిఁ॥ 27

ఉ॥ దీని మొగంబుడంబు మఱి ♦ దీని విలంబకుచంబులందమున్
దీని ఘనోరుకాండయుగ ♦ దీర్ఘవికీర్ణసుకేశపాశమున్
దీని మధుప్లుతాధరము ♦ దీనిమహోన్నతరోమరాజియున్
దీని సుబాహుమూలరుచి ♦ తెల్లమునా కెఁదబాఁడు వెప్పడున్॥ 28

ఉ॥ సానులఁగాంచనో? మునుపు ♦ చక్కనిచిక్కనినిక్కుముక్కుపె
న్నోక్కులఁగాంచనో? కడు సము ♦ జ్జ్వలపంకజపత్త్రవిభ్రమా
నూనవిలాసపేశల మ ♦ నోహరయోనికి సాటి సేయఁగా,
గానగఁరాదు, వస్తు వది ♦ కన్నులఁ గట్టిన యట్లదో చెడిఁ॥ 29

సీ॥ చంద్రబింబస్ఫూర్తిఁ ♦ జౌకసేయఁగజాలు
ముద్దుగారెడి నవ్వు ♦ మోముతోడ
కలువరేకుల డాలు ♦ గడకొత్తగాజాలు
తోరంపునిడుదకం ♦ దోయితోడ
కరటికుంభంబుల, ♦ బరిభవింపగజాలు
కర్కశకుచయుగ్మ ♦ కంబుతోడ

బంధుకీవముతోడ ♦ బ్రతిఘటించగఁజాలు
రాగసంయోగాధ ♦ రంబుతోడ

గీ॥ సొగసు గులుకంగ నుసరతిఁ ♦ జొక్కఁజేసి,
కొసరి నా మానసంబెల్లఁ ♦ గొల్లలాడి,
నన్ను దాసునిగా నేలె ♦ నన్నిగతుల
దీన వర్ణంపుమా రసో ♦ దీర్ణముగను॥ 30

కం॥ ఎన్నివిధంబుల దెంగిన
దన్నదు తిట్టదు, వరాలు ♦ ధాన్యము సొమ్ముల్
సన్నపుఁ గోకలుఁ దెమ్మని
నన్నడుగదు, యిట్టివార ♦ నారులుఁ గలరే? 31

కం॥ భగముబిగి మొగముజిగియును
జగురాకన్మోవికావిఁ ♦ జెప్పఁగఁదరమా
సొగ నన్నను దీనినిగడు
సొగసుగ వర్ణింపవలయు ♦ సుకవితంసా॥ 32

వ॥ అని యత్యంతప్రేమాతిరేకంబున వేఁడిన నే నిట్లంటి. 33

సీ॥ ఆది పురోహితు ♦ లైన తేజోమూర్తు
లను గతాయుల కడ ♦ కనిపినావు
సాధు జయంతి మ ♦ హాదేవుమాన్యంబు
తెలమి కాసాలంజ ♦ కిచ్చినావు
రాయవరంబు మీ ♦ రాశిదారుల నెల్లఁ
గొట్టి కొంపలఁ బసు ♦ ల్గట్టినావు
ధర్మాత్ముఁడును దాత ♦ తమ్ముఁడు నగు రాయ
విభు నిరుద్యోగిఁగా ♦ వించినావు

గీ॥ బోయ గొల్లామువోగాసు ♦ బోకయుండ
వేంకటమనీషిచేత ని ♦ రంకుశగతిఁ

గ్రతువు సేయించితివి నీకు ♦ గృతియొనర్ప
నర్హమగునట్లు చేతు నీ ♦ లాద్రిరాజ. 34

వ. అనినం బ్రహృష్టమష్టహృదయుండై శిరఃకంపంబు సేయ నేనును బరమానందకందళిత మానసారవిందుండనై వచ్చి యతనికి మష్టాంతంబు లీప్రకారంబునం జెప్పం బూనితి. 35

క. నీచాధారునకు మహా
యాచకశుకశాల్మలీద్రుమా ♦ మాకారునకున్
బ్రాచుర్య వికారునకుం
రాచిన్నపకులాబ్ధిగరళ♦ రసనారునకున్ 36

క. క్రూరునకు సాధుబాధా
చారునకు న్వైనిపాన ♦ సంశీలునకున్
జారునకు విప్రతతి ధన
చోరునకున్ బుద్ధిహీన ♦ శుభరహితునకున్. 37

క. పరనారీ భగచుంబన
పరతంత్రున కఖిలదుష్ట ♦ పాపాత్మునకున్
నిరుపమదుర్గుణశీలికి
ధగత్రా నీలాద్రిరాజ ♦ దౌర్భాగ్యునకున్. 38

క. అతిమూఢశీలునకు సం
తతమృగయాఖేలునకును ♦ దాసీవనితా
వితతరతిలోలునకు ఘన
పతితకుజనపాలునకును ♦ బదయామునకున్. 39

క. దుష్చరితునకు రండా
గర్భాపాతనవిధాన ♦ కౌశలకలనా
విఖ్యాతాయశునకున్
నిర్భరకలుషాత్మునకును ♦ నిర్లజ్జునకున్. 40

క. ఆవిష్కృత చంద్రికగ
దేవీపూజావిధాన ♦ ధీసారునకున్
గేవల రణధీరునకున్
భూవలయోద్ధరణఘోర ♦ భూదారునకున్. 41

క. వారవధూ సారమధూ
త్కారివదనచుంబనక్రి ♦ కచభవదురువ
స్త్రాక్రియాఢ రదనునకుగాం
తారాంతర సదనునకు వి ♦ తతవిధునకున్. 42

క. చింతలపాట్యన్వయతత
కాంతారకుఠారునకును ♦ ఘనతరచింతా
క్రాంతునకు నీలధరణీ
కాంతునకు న్స్వీతసుగుణ ♦ గణశాంతునకున్. 43

వ. అనభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన చంద్రి
రేఖావిలాపం బను సత్ప్రబంధరాజంబునకుగథా క్రమం బెట్టిదనిన—

—♦ కథా ప్రారంభము. ♦—

వ. మున్ను శ్రీశివబ్రాహ్మణవర్ణాగ్రగణ్యుండగు వీరభద్ర భట్టార
కేంద్రునకు శ్రీమద్వైఘానసవంశోత్తంసం బగు నంబినరసింహాచార్య
వర్యుండిట్లని చెప్పందొడంగె. 44

సీ. బహుళనానావిధ ♦ పశుకళేబరచర్మ
కంకాళవాలఖు ♦ రాంకితంబు
మస్తిష్కవల్లూర ♦ మాంసఖాదనమోద
కంకవాయసగృధ్ర ♦ సంకులంబు
సాంద్రక్షతబిందు ♦ సందోహపరిమిళ
న్మక్షికాక్రిమికీట ♦ కాక్షయంబు
పలలాశనానంద ♦ భరితపరస్పర
కలహకృత్కౌలేయ ♦ గవయశివము

గీ. మధురతరమదిరాపాన ♦ మదభరాతి
ఖేలబాలిశచండాల ♦ జాలతాడ్య
మానతూర్యనినాద స ♦ మన్వితముదు
రాపవపల్లి బోయగో ♦ ల్లాపపల్లి. 45

గీ. బోయలును గొల్లలును నందు ♦ బొందుగూడి
యుండుటను బోయగొల్లను ♦ యూరు వెలసె
మఱియు దగ్గ్రామమున నొక ♦ మాలపెద్ద
చెలువు, ద్రవ్వించె జనుల క ♦ చ్చెరువు గాఁగ- 46

వ. అంత గొంతకాలంబునకు. 47

క. అప్పాగావున నొకకృతిఁ
జెప్ప నతం డడఁగ నాదు ♦ జేరెను వినయం
బొప్పఁగ వేంకటశాస్త్రిలు
గుప్పున నతఁ డాడిమూళ్ళు ♦ కులుఁ జెన్నంగన్. 48

గీ. వానిఁ బ్రార్థింప నొకపెను ♦ పాకఁజూప
వాసముగ నంపు వసియించి ♦ వలనుమీరఁ
గొడుకులును దాను వాఁడెచ్చు ♦ కొలుదినుచు
నిడుములను నోర్చి కాలంబు ♦ గడుపుచుండి. 49

క. నీలాద్రివిభుని కాక్కృతి
వాలాయముగ నిచ్చి సిరులు ♦ వడయఁగ వలె నం
చాలోలచిత్తమున దా
నాలోచన చేయుచుండె ♦ నాత్మజుతోడన్. 50

వ. అంత. 51

క. కటకపు వేంకటసానికె
విటు డగుటను నూజవీడు ♦ విడిచి యచటికిన్

పటుకన గూతుం దోడ్కొని
మటుమాయలు పన్నుకొనుచు ♦ మచ్చిక జేరెన్. 52

క. చేరిన దాని నతడు గని
కూరిమితో గౌగిలించి ♦ కొని మక్కువ నా
హారాదికంబు లిడుచును
మారక్రీడల జెలంగి ♦ మన్నన నునిచెన్. 53

వ. అది యెట్టిదనిన. 54

సీ. పుట్టకాల్ సొట్టకేల్ ♦ నట్టివ్రేలుం జెవుల్
పట్టలే కట్టెట్లు ♦ బిట్టు గదలు
మిట్టపండ్లును బెను ♦ లొట్టకన్గవయును,
బిట్టలై చుట్టలై ♦ పిట్ట నిడిడి
దట్టమౌ బలుకొంగ ♦ ఫెట్ట చట్టలను
గొట్టంగ సమకట్టి ♦ నట్టితెలుపు
కెట్టింప సౌదల ♦ బుట్టి చెంపలమీద
నట్టాడు నీకల ♦ కట్టచుట్ట

గీ. తొట్టిపెదవులు దుంపర ♦ లుట్టిపడెడు
చట్టికైన యగునోరును ♦ గట్టిలేక
గొట్టుమిట్టాడు బలుజను ♦ లుట్టిపడెడు
యోని గలయది వేంకట ♦ సాని మణియు. 55

సీ. కళ్లు పెల్లుగదాగి ♦ కాటుకూతలు గూయు
మాలని నైనలు ♦ మరులుగొల్పు
కాసుపీసంబులు ♦ వాసిగాలంకించి
జుడిగి నెల్లాళ్ళలో ♦ జోగిజేసి
యిలవెళ్ళగా గొట్టు ♦ నెక్కువతక్కువ
మాటలాడును వట్టి ♦ బూటకములు

వేంకటశాస్త్రిల ♦ వేశ్య నెవ్వారితోడ
నవ్వదంచును జనుల్ ♦ నమ్మఁ దిరుఁగు

గీ॥ కూఁతునకు నెవ్వనిం దెచ్చి ♦ కోమరు కన్న
పాయ మిప్పించి యే రీతిఁ ♦ బ్రబలు నల్లు
చేసెదవో యంచుఁ జెవిలోనఁ ♦ జెప్పు చుండు
శాస్త్రిగారికి వేంకట ♦ సాని యెపుడు॥ 56

క॥ ఈసరణిఁ దెలుప నాతం
డా సానిం జూచి పలికె ♦ నలివేణి! మదిన్
వేసరక తాళి యుండుము
నీ సుతకున్ గూర్మిఁ గూర్తు ♦ నీలాద్రినృపున్॥ 57

క॥ నా కృతికన్యకకును గన
దాకృతి యీ కన్యకకును ♦ నతనిం బతిగా
నీకోసఁ జేసిన మనకున్
జేకుఱు భాగ్యం బటంచుఁ ♦ జెప్పి రయమునన్॥ 58

ఉ॥ యాగము పేరు చెప్పికొని ♦ యర్థము భూప్రజ వేఁడి తెచ్చినన్
భోగము సేయవచ్చు నిజ ♦ పుత్త్రసహోదరదారబంధు సం
యోగము గాఁగ నంచుమది ♦ నూహయొనర్చి, యతండఖండమా
యాగుణదూషితాత్ముఁడయి ♦ యచ్చోటువెల్వడియెల్లభూములన్॥

క॥ నీచత్వమునకు రోయక
చూచిన నరులెల్ల వేఁడి ♦ సుడివడక కడున్
యాచన జేసి పదార్థ ము
గోచరముగ సంగ్రహించు ♦ కొని వచ్చి వెసన్॥ 60

ఆ॥ వె॥ మాలవాని చెఱువు ♦ మఱువున బందిళ్లు
సాలలును ఘటించి ♦ సంభ్రమమున

యాజకులును బెద్ద ♦ లైన విప్రుల గూర్చి
దీక్ష బూని నిజ ♦ సతియును దాను॥ 61

ఆ॥ వె॥ కడక దక్షిణాగ్ని ♦ గార్హపత్యాహవ
నీయ వహ్ను లందు ♦ నిలిపి మంచి
మేకపోతుగముల ♦ మెదల కుండ వధించి
వెరవు మీఱ నందు ♦ వేల్చు చుండి॥ 62

ఆ॥ వె॥ ముఖము జూడ వచ్చు ♦ మనుజుల కిట్టిట్టి
గాగ నన్న మిడదు, ♦ గదుముడనుచు
గొడుకుతోడ దనదు ♦ కూతుమగనితోడ
జెప్ప వారు లోభ ♦ చిత్తులగుచు॥ 63

క॥ కొందఱ కొ కింత కూ డిడి
కొందఱకుం గూర లొసఁగి ♦ కొందఱ కిడకే
దండన సేయుచు గెంటుచుఁ
గొందఱఁ దిట్టుచును వెళ్ళఁ ♦ గొట్టుచుఁ గడఁకన్॥ 64

సీ॥ పుడమిఱేం డ్లంపిన ♦ గుడదధిసైయంగ
పీనముల్ లోనిండ్ల ♦ లోన డాఁచి
కరణాంబు లంపిన ♦ కంద పెండలములు
పదిలంబుగా నేలఁ ♦ బాఁతి వైచి
బ్రాహ్మణు ల్దెచ్చిన ♦ బహువిధఫలములు
లోలోనఁ దనదు చు ♦ ట్టాలకిచ్చి
కోమట్లు దెచ్చిన ♦ గురుతరవస్తువుల్
మెల్లమెల్లనఁ దానె ♦ మ్రింగివైచి

గీ॥ పప్పులో నుప్పు మిక్కిలి ♦ పాలఁ జల్లి
నేతిలో నాముదమ్మును ♦ నిండ నింపి
పులుసులో గంజి మిక్కిలి ♦ కలయఁ బోసి
భక్ష్యములలోన మిరియంపుఁ ♦ బదడు గలిపి॥ 65

తే॥ గీ॥ మంచి బూరెలు పొణకల ♦ మాటు నెట్టి
పిండిబూరెలొక్కొకముక్క ♦ పెద్దవారి
విస్తరులలోనఁ బొఱంగ ♦ విసరివైచి
కసరికొట్టిన విప్రులాఁ ♦ కటను లేచి॥ 66

క॥ శపియించుచు నొడలచేఁ
దపియించుచు నేఁటి కేమి ♦ తాళఁ డటంచున్
జపలస్వాంతుం డీతఁడు
కపటపుయజ్ఞంబు సేయఁ ♦ గడఁగె నటంచున్॥ 67

క॥ చప్పట్లు చఱచుకొంచును
ముప్పున నితఁ డేల క్రతువు ♦ మొనసి యొనర్చెన్
మెప్పైతనఁబునకి నర్థము
గుప్పున నిక్కపటవృత్తిఁ ♦ గూర్చె నటంచున్॥ 68

తే॥ గీ॥ జవ్వనంబున వేంకటసాని యధర
మధువు గ్రోలిన రోత పో ♦ మది దలంచి
వృద్ధదశ సోమపాన మి ♦ వ్విధి నొనర్చె
గాని స్వర్గాపవర్గేచ్ఛ ♦ గాదు సుండు॥ 69

తే॥ గీ॥ అనుచు జను లెల్ల నిబ్బంగి ♦ నాడు చుండి
రంత వేంకటశాస్త్రి యా ♦ గాయతనము
ప్రకటముగ జూడ జంతల ♦ పాటి నీల
నవరగ్రామణి మనంబు ♦ నం దలంచి॥ 70

క॥ భోగము మిడిచేశంబులు
భాగవతులు వేటకాండ్రు ♦ భషకచయంబుల్
మూగి తన వెంట గొలువగ
వేగంబున దరలి యట బ్ర ♦ వేశంబయ్యెన్॥ 71

వ॥ ఇట్లు ప్రవేశించి యవ్విప్రపుంగవు దర్శించి యుడుగరలొసంగి శాలాసమీపంబునం బటకుటీరాభ్యంతరంబున నిలిచి తదీయ కృత మంత్రతంత్రప్రయోగప్రధానవిధానంబు లాలోకించి హాళిం గనుచుండె; నయ్యవసరంబున॥

సీ॥ నిష్ఠలోపలి పుచ్చ ♦ విత్తులగతి గప్పు
గల గొగ్గిపండ్ల సిం ♦ గార మమర
నిప్పు గల్గిన మేడ ♦ కుప్పలోఁ బురువుల
చొప్పునఁ గొప్పున ♦ సుమము లమర
కప్పచిప్పలఁ బోల్పు ♦ కండ లూడెడి రీతి
జీఁకు కన్నులఁ బుసు ♦ లేపు మీఱ
మూతి చెంగట వ్రేలు ♦ ముసు తంబకాయలు
సరణి పొక్కిలి దండ ♦ చన్ను లొప్ప
గీ॥ గడిబొగ్గువలెను మేను ♦ గానిపింప
బారకట్టల తెఱఁగున ♦ బాహువులర
జనకయాగంబుఁ జూడవ ♦ చ్చెను త్రికోణ
సాంద్రతరరోమరేఖ యా ♦ చంద్రరేఖ॥ 73

క॥ ఇటు వలె నచటికి వచ్చెడు
నిటకంటకిఁ జూచి చిత్త ♦ విభ్రమ మొదవన్
దటుకున నీలనృపతి హృ
త్పుటమున సోలుచును దానిఁ ♦ బొగడఁ దొడంగున్॥ 74

క॥ జడకుచ్చును మెడపెచ్చును
నడగచ్చును బొచ్చు పెఱిఁగి ♦ నలుపగు మేనున్॥
నిడుద లగు తొడల బెడఁగున్
గడు వలమగు నడుముఁ గలుకు ♦ కలికిది భళిరా॥ 75

క. నిక్క పొగపిదుతి గదరా
ముక్కు; మొగం బెన్నఁ గోతిఁ ♦ ముఖమున కెనయా
బొక్కిలి మొలలో తగు భళి
యక్కజంపు నూనెస్రుద్దె ♦ లౌర కుచంబుల్. 76

తే. గీ. మోవి పీయూష మూరును ♦ గేవలముగ
గవ్వదళసరి పండ్లహా ♦ కలికిమేని
మృదువు కోరింతకంపలఁ ♦ గదుమఁజాలు
చెక్కులిలారు లోహాప్పు ♦ నక్కలౌర. 78

ఆ. వె. చూపు కాకిచూపు ♦ నేపాదుకన్నులు
పిల్లికనులఁ గదుము ♦ నుల్లిసిల్లు;
సర్వము గార్దభమును ♦ బరిహాసింపగఁ జాలు
మదనసదన మొల్ల ♦ మంగలాబు. 78

క. ఈ పీటుసాని నెచ్చట
గానము గదమున్న నేఁడు ♦ గట్టిగదీనిఁ
బోనీక రతిగలంపక
హా నేత్రియఁ దాఘనాఁడ ♦ నికనివ్వోటక్. 79

క. భషకకపిచటకగార్ధభ
వృషభాదికబంధగతుల ♦ వేమఱు దీనిన్
విషయింపక నేలాగున
విషమశరుశరాళి బాధ ♦ నీడుదు నాకున్. 80

సీ. బాలరండలఁ బది ♦ వేల మరుగ్గాల్పి
కోర్కెదీరగ మున్న ♦ గూడినాడ
మగవాండ్రబెక్కండ్ర ♦ మచ్చిక గ్గావించి
కొంచక రతుల జా ♦ క్కించినాడ

నాసికాజనులకుఁ ♦ గానుపీసంబీక
వెనుఁ గొల్లవంపులు ♦ వెట్టినాడ
నానిబోగముపాంద్ర ♦ జనవుబల్మినిబ్బ్ర
పలుమారు రతికేళి ♦ గలిసినాడ

గీ. కాని యీసోయగమును నీ ♦ కలికిమీఁది
ప్రేమమును పెఱచోట ల ♦ భింపలేదు
మరుని మాయావికారమో! ♦ మగువమచ్చు
మందుచల్లెనో; నామది క్ర మందగించె. 81

క. ఈ మా పీ యింతిని నా
కామాతురత మెల్ల దీఱ ♦ గాఢతరమహో
ద్దామాయత ఖరబంధో
ద్దామత మెఱయంగ దెంగె ♦ దను వలపారన్. 82

శా. పుణ్యాంబేదిన నేదనీ,జనులుగుం ♦ పుగ్గాడి కా దంచుఁ గా
ర్పణ్యప్రక్రియ దెల్పినం దెలుపనీ, ♦ రాజు ల్మహోదుగ్రుగా
గణ్యుండంచును బల్కినం బలుకనీ, ♦ కౌతూహాలంబొప్ప నీ
పణ్యస్త్రీమదురాధరోదితసుధా ♦ పానంబు గావించెదన్. 83

ఉ. చెక్కిలి నొక్క ముద్దుఁగొని ♦ చిక్కనిచక్కని గుబ్బచన్నులం
దొక్కట గోరులుంచి, జిగి ♦ యూరువులంటుచు,గోర్కెదీరగాఁ
గుక్కుటబంధమై ఖరుల ♦ గూడఁగాక మనోజుధాటిచే
నిక్కడ నిల్వగాదరమె ♦ యించుకయున్? బెరమాటలేటికిన్.84

క॥ అని యనివారితమోహము
మనమున బెనగొనగ నతడు ♦ మఱిమఱి చూడన్
వనితయు నాతని దప్పక
కనుగొని యనురాగ మొదవ ♦ గడక నుతించెన్॥ 85

సీ॥ పరువంపుఁబాయంపుఁ ♦ దురకబిడ్డనిరీతి
మట్టుమీఱఁగ బాగ ♦ జుట్టినాడు

మలజేష్టకరనగు ♦ వెళువు మొగంబును,
బొడకంత తలకాయ, ♦ కుడిశిగూన
జోలెడు బొజ్జయుఁ ♦ బొలసుగన్నులలావు
నడుము, రాపాడెడు ♦ నడుగులౌర!

గీ. పెద్దమేనుగుకాలంత ♦ కస్తుశిశ్న
మిట్టి సౌందర్యనిధి భువిఁ ♦ బుట్టజేసి
నట్టితామరపట్టి నే ♦ ర్వరయఁదరమె
చాలజదివిన వేంకట ♦ శాస్త్రికైన. 90

క. నాపూర్వపుణ్యఫలమున
నీపురుషునితోడ నేస్త ♦ మొనసినగూర్మిన్
దే పిచ్చెద మా పిచ్చెద
గాపట్యము లేని నిండు ♦ కౌగిలి తనికిన్. 91

చ. జడకటిసీమదూలఁ విడు ♦ జన్నులు అొమ్ముఁ గ్రేలఁ గొప్పు వె
న్నడరుచుఁ జిందులాడఁ బురు ♦ షాయిత బంధకళాప్రవీణతన్
జెఁటగుడు లాడి వీనిఘన ♦ శిశ్నపటుత్వమహాత్వ మెన్నుచున్
విడువక వీనిఁ గూడి మది ♦ వెఱ్ఱి దగుల్కొనజేయుచున్నదో. 92

సీ. కూఁతుబుడము, మర్ల ♦ మాతంగియాకును
మూత్రింబుతోనూరి ♦ ముద్దఁజేసి
పచ్చిపసపుతోడ ♦ బాగుగామర్దించి
నూనెతోడనుగూర్చి ♦ మేన నలుగు
వెట్టిన, నుమ్మెత్త ♦ విత్తులు గుంటెత
ల్లడపాకు పసరు ను ♦ ల్లాసమునను
గాల్మడిఁ గలిపి పో ♦ కలు దానిలోపల
నానించి యెండించి ♦ లోనికిముఖ

గీ॥ వీడియముతోడఁ బెట్టిన ♦ విడువ కితఁడు
బంటు తెఱఁగున నా వెను ♦ వెంటఁ దిరుగు
నల్లు చేయఁగ నతఁ డెన్ని ♦ డబ్బు లొక్క-
మెల్లమెల్లనఁ గలధనం ♦ బెల్లదొబ్బె॥ 93

క॥ కొందఱు మలయుక్తముగా
మం దిడుదురు మరులుకొనఁగ ♦ మా పారసనుల్
మందతఁ జెందును విటుఁ డటు
నింద గదాయిట్టుల సేయ ♦ నృపవర్యునకున్॥ 94

క॥ ఏలాగు మాట లాడుదు?
నేలాగున మరులుకొలిపి ♦ యెలయింతును? నే
నేలాగు లోలుఁజేయుదు
నేలాగున గలుగు విత్త ♦ మెల్ల హరింతున్॥ 95

క॥ అని చాల జాలి నొందుచుఁ
జనుగుబ్బలఁ బైఁట జార్చి ♦ చక్కఁగ నొత్తున్
మొనవాడిచూపుఁ జూచును
వెనుకొప్పటు జాఱఁ జేసి ♦ బిఱబిఱ ముడుచున్॥ 96

తే॥ గీ॥ ఆవ ద్రావిన పసరమ ♦ ట్లది మెలంగ
జూచి నీలాద్రిభూపతి ♦ సొమ్మసిల్లి
మెల్లమెల్లన తెలివొంది ♦ కల్లు ద్రావి
పరవశత నొందు చండాలు ♦ పగిదిఁ దోఁచి॥ 97

సీ॥ వలఁ బడ్డ మీను కై ♦ వడి, నిప్పుఁ ద్రొక్కిన
కోఁతి భాతిని, వెట్టి ♦ గొన్న కుక్క-
పద్ధతి, గుడితిలోఁ ♦ బడిన మూషిక మట్లు
శ్లేష్మంబులో నీఁగ ♦ లీల, సన్ని-

పాటి చందంబున, ♦ వాతంపుగొడ్డు వి
ధంబున, లాహిరీ ♦ దళము మిగులఁ
దినిన పాశ్చాత్యుని ♦ తీరున, నురి వడ్డ
పక్షి కైవడిఁ, బెను ♦ పాము పదిగి,

గీ॥ భూత మూనిన మనుజుని ♦ పోల్కిఁ, బెట్టు
మందు మెసవిన మానవు ♦ మాడ్కి, దేహ
మెఱుఁగ కెంతయుఁ గళవళం ♦ బెసఁగ దాని
పైఁ దలం పిడి కన్ను మో ♦ డ్చక యతండు॥ 98

క॥ తలనొప్పియుఁ దాపజ్వర
మలసటయును మిగులఁ బొడమ ♦ నసురసు రనుచున్
నిలువంగ బలము చాలక
తలిమమ్ముపై వ్రాలి దానిఁ ♦ దలఁచుచు నుండెన్॥ 99

క॥ అని నంబి నారసింహా
ఘను వొప్పఁగ నిల్లు చెప్ప ♦ నా తంబళి వీ
రన యూవలి కథ లెస్సఁగ
వినయంబునఁ జెప్పు మనుచు ♦ వెసవేఁడుటయున్॥ 100

ఉ॥ నీచచరిత్ర! వారరమ ♦ ణీభగరుక్తతగాత్ర! నిత్యదు
ర్యాచకమిత్ర! సజ్జన ప ♦ దార్థ పరిగ్రహశైకసూత్ర! దు
ష్కాచపిశంగనేత్ర! నృప ♦ కర్మ మహాలతికాలవిత్ర! శ్రీ
రాచినృపాలగోత్ర వన ♦ రాశికనడ్బడబాగ్నిహోత్రమా॥

భుజంగప్రయాతము

దురాలాప దుర్ఘోష ♦ దుర్మార్గవర్తీ!
ధరామండలఖ్యాత ♦ ధౌర్త్యాపకీర్తీ!
పరస్త్రీరతాసక్త ♦ భావప్రవృత్తీ!
స్థిరాయుష్షిపరాజాత ♦ దీర్ఘోగ్రమూర్తీ!

— గద్యము. —

ఇది శ్రీమజ్జగన్నాథ దేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధ సరసకవిత
విచిత్ర సలలితాపస్తంబసూత్ర కౌండిన్యసగోత్రకూచిమంచికుల
పవిత్ర గంగనామాత్య పుత్త్రమానితానూన సమాననానా
విధరంగత్రిలింగదేశభాషావిశేషభూషితాశేషకవితావిలా
సభాసురాఖర్వసర్వలక్షణసారసంగ్రహోద్దామశుద్ధాం
ధ్రరామాయణ ప్రముఖబహుళప్రబంధ నిబంధన
బంధురవిధాన నవీనశబ్దశాసన బిరుదాభిరామ
తిమ్మకవిసార్వభౌమసహోదర గురుయశో
మేదురవివిధవిద్వజ్జనవిధేయజగన్నాథ
నామధేయప్రణీతంబైనచంద్రరేఖా
విలాపం బను హాస్యరస ప్రబంధ
రాజంబునం బ్రథమా
శ్వాసంబు
సంపూర్ణము.

---

శ్రీరస్తు.

# చంద్రరేఖావిలాపము.

## ద్వితీయాశ్వాసము



రహితగేహా! చంద్రీ
వారవధూమదనసదన ♦ వర్ధితసుఖరో
గారూఢిత మృదుదేహా వ
నీరంగవిహారసాంద్ర! ♦ నీలనరేంద్రా!॥ 1

వ॥ ఆకర్ణింపుము తావకీనకథావిధానంబు యథార్థంబుగాఁ దొల్లి శ్రీ శివబ్రాహ్మణవర్ణాగ్రగణ్యుం డైన వీరభద్రభట్టారునకు శ్రీమద్వైఖానసవంశోత్తంసం బగు నంబి నరసింహాచార్యుం డప్పాలి కథ యిట్లని చెప్పం దొడంగె. 2

క॥ అక్కమలేక్షణ యది గని
చిక్కెంబో వీఁడు నాదు ♦ చేతి కటంచున్
సిక్కుచుఁ దల్లికడకుఁ జని
మక్కువ నక్కథ యెఱుంగ ♦ మఱుపునఁ దెలుపన్॥ 3

వ॥ ఇట్లు దెలుప వేంకటసాని యిట్లనియె. 4

క॥ నీతండ్రి క్రతువు కనుఁగొన
నాతతగతి నీలనృపతి ♦ యరుదెంచి నినుఁ
గాంతిరి గని మోహించుట
లాంతులలోఁ దేనె పుట్టి ♦ నట్లయ్యె గదే॥ 5

క॥ ఏమేమి! నీలభూపతి
నీమీఁదం గన్నువైచి ♦ నిష్ఠురజవన
త్కామశరజాలనిర్ధి
తామేయుశ్వాంతుఁడయ్యె ♦ నా? మేలు భళీ! 6

క॥ కూఁతుర! యాతురపడి నీ
వాతని జేరంగఁ బోకు ♦ మటుతాళుము; నాఁ
డేతెంచు సంచులను ధన
మాతతగతి నించుకొంచు ♦ వ్యామోహమునన్॥ 7

క॥ వలపెంత నీకు గలిగిన
కులధర్మము తప్పరాదు ♦ కుమ్మరపురువుం
బలెఁ దిరిగి పొట్టఁ బోషగ
వలెఁ జామ్మా! ముస్తుగుమ్మా! ♦ వగనాయమ్మా॥ 8

వ. అని యనేక ప్రకారంబుల లాలించి మేళించి తన కాలంబు
నాఁటి నాటకంబులు బూటకంబులు బోటిచదవంబులు నీటులు కూటం
బులమాటలు చాటుమాటు లేక తేట తెల్లముగా నజ్జోటిబోటితోఁ
జాటం దొడంగ. 9

క॥ వేంకట శాస్త్రిలువంటి ని
రంకుశులను మరులుకొల్పి ♦ యర్థము చాలన్
లంకించి నాకునమ్మిన
కింకరులుగ జేరకొంటెఁ ♦ గిమ్మనకుండవే॥ 10

క॥ మున్నెంతె వాఁడు వేడిన
గన్నెఱకంబీక మీఁదు ♦ గట్టితినీశ
మన్ననఁ గైకొమ్మని విటు
లన్నిత్యము మాయచేసి ♦ లంకించుదగాన్॥ 11

ఆ॥ వె॥ ఒకఁడు గానకుండ ♦ నొక్కని రావించి
యొకనిచెంత కేఁగు ♦ చుండి నడిమి
దారినొకనిఁగూడి ♦ తబ్బిబ్బు గావించి
ధనము కొల్లగొందుఁ ♦ దవిలి ముందు॥ 12

క॥ మందుల మంత్రంబులచే
విందులచేఁ బూతఁచేత ♦ నీఁజెంబులచే
తెందనపదముల నాటల
మందులగావించి విటుల ♦ మానక దోతున్॥ 13

ఉ॥ అందలముల్ శతాంగములు ♦ నశ్వచయంబులు పాలకీలునున్
మందరశైలరాజనిభ ♦ మత్తగజంబులు వెంటనంటి రా
ముందఱఁ బొందు గాధనము ♦ మూటలు మేటులుకొన్కలంపి నా
మందిరసీమగాతు రస ♦ మాన నృపాలకుమారులెప్పుడున్॥ 14

క॥ నీ కేమిచెప్పవలయును?
లోకులెఱుఁగుదురు; నాఁటి ♦ లోమదనుఁ డహో,
నాకనుసన్నల మెలఁగును;
కా కొండిన నింతసొమ్ము ♦ గడియింతునవే?॥ 15

క॥ అప్పారాయని సభలో
మెప్పొందితి సాటి సాని ♦ మేళంబులలో
చెప్పిన బగ్గగ నీమది
కిప్పుడు తోచునుఁ మఱెవ్వ ♦ రిచ్చట సొక్కుల్॥ 16

క. చెలమకు బిట్టలలు చేరెదు
పొలుపున నాయింటి చుట్టు భోగాభిరతిన్
పలుగు గులాములు తురకలు
వలకొని కానుకలు గొనుచు ♦ వత్తురు సుమ్మీ॥ 17

క॥ కట్టన కోకలు కట్టక
పట్టిన మణిభూషణములు ♦ పెట్టక సిరులం

వొట్టి విటకోటి గొలువగఁ,
దిట్టతనంబునను గొలువు ♦ దీర్తుగడంకన్- 18

క॥ జూదంబులు బటువీణా
నాదంబుల దండలాస్య ♦ నటనములమతుల్
భేదించి విటజనంబుల
చే దండుగఁ గొందు ధనము ♦ చెప్పగనేలా?॥ 19

సీ॥ వలిప చెంగావిపా ♦ వడకటిస్థలిఁ దాల్చి
జిలుగైన సరిగంచు ♦ చీరగట్టి
కులుకుగుబ్బలమీఁద ♦ మలయజాతము పూసి
కట్టువాపని కంచు ♦ కంబు దొడిగి
లీలగాసిగ వేసి ♦ పూలదండలు చుట్టి
ముత్యాల తాటంక ♦ ములు ధరించి
కడియాలు కుంభేళ్ళు ♦ గంటలొడ్డాణంబు
బవిరెలు బావిలీల్ ♦ బన్నసరులు

గీ॥ నుంగరంబులు కెంపుల ♦ ముంగరయును
మొదలుగల సొమ్ములను దాల్చి ♦ మురిపె మమర
దిరుగుచును విటకోటుల ♦ ధృతిగలంచి
హోన్నులుగ గడింతు మరువాన ♦ చిన్నదాన! 20

క. నా వగ నామోసపరినడ
నా వాలుఁజూపునొప్పు ♦ నామాటలతీ
రా వంతయు నీవెఱుఁగ; వ
హా! వన్నెలకానికూతుఁ ♦ రా! యిది మేరా?॥ 21

క॥ చంద్రు పడెఁ బండ్లుకదిలెను
గండ్లకుజత్వర మొదవె ♦ గాయము ముదిసెన్
గొండ్లును భగమును బిగిచెడి
దిండ్లు తిరుగు నేర్పుదప్పె ♦ ధృతిమాలు పూనెన్॥ 22

క॥ వృద్ధత్వ మిప్వివిదంబున
సిద్ధించెను గాని, యిపుడు ♦ చిల్లరవిటులన్
బద్ధానురాగులుగ నని
రుద్ధజనకుఁ గేళి దేల్చు క్రరో వెలగొనవే? 23

తే॥ గీ॥ కాన నీవును నావలెఁ ♦ గాముకులను
వంచనము చేసి విత్తమా ♦ ర్జింపవలయు
గాక, యాతనిపై మోహ ♦ కాంక్షపూనఁ
జనునె! వాడెంత సౌందర్య ♦ శాలియైన?॥ 24

మ॥ అసదృక్కాముకుఁడౌటచే తనుతదీ ♦ యాంగంబునం దెంతయున్
రసపాకుల్బలుబిళ్ళలు స్పృహలుళఘో ♦ రస్ఫారజాగ్రత్ప్ర మే
హసుఖవ్యాధులు మానకుండును సదా ♦ హా! వానిసాంగత్యనన్
వెస నంటుం గద! నీ భగస్థితి భయా ♦ విర్భూత భావంబునన్॥ 25

క॥ అదిచెడుట నీవు చెడుటయె
కద; యెవ్వరు నిన్నుఁ దేఱి ♦ కనుగొనకయె న
వ్వుదు, రొక కాసు నొసంగరు;
తుదినీబ్రతుకేమి యగునొ ♦ తోచదునాకున్॥ 26

ఆ॥ వె॥ అనుచు బోధసేయు ♦ నట్టి మాయలనుల్లి
బేసబెల్లి వగల ♦ వేసవెల్లి
నులిపి తెగులుబొల్లి ♦ నుల్లసిల్లెడుతల్లిఁ
జూచి యాబొజుంగు ♦ జోటి పల్కె॥ 27

క॥ అమ్మా నా మానస మిపు
డమ్మానిసి జేనిమీఁద ♦ నంటివదల, దిం
కిమ్మాడ్కిఁ జెప్ప నేటికి?
బొమ్మామరు చేతికీలు ♦ బొమ్మాసరగన్॥ 28

క॥ ధనమేమి బ్రాఁతి నాకది
ఘనమే? ఘనమేచకప్ర ♦ కటకచ! వాఁడే

పెనుమేటి పెంమిటి కదా;
విను మే నిక్కంబు విన్న ♦ వించెద దల్లీ॥ 29

ఆ॥ వె॥ పెల్లు కల్ల లల్లి ♦ బొల్లిమాటల జల్లి
మెల్ల మెల్ల నిల్లు ♦ గుల్లసేయు
తల్లి గలుగు లంజె ♦ నల్లోలమతి జేరు
పల్లవులకు సౌఖ్య ♦ మిల్ల జగతి॥ 30

క॥ రమ్మంచును నమ్మించును;
బొమ్మంచుం గొక లాకు ♦ పోకల్ సూఁకల్
క్రొమ్మించు సొమ్ము లెమ్మం
దె మ్మంచును తాకు లంజె ♦ తెగి విటవరులన్॥ 31

సీ॥ లఘువర్ణ గురువర్ణ ♦ లక్షణం బరయక,
సరసపదార్థముల్ ♦ సంగ్రహించి,
వృత్తభంగమునకు ♦ వెఱ పింతయును లేక,
గణనిర్ణయనిరూఢి ♦ ఘనత గనక,
యుపశబ్దములకు రో ♦ యక, సంధివిగ్రహ
ప్రాణహాని విచారి ♦ పరత దక్క
భావం బెఱుంగక, ♦ పండితోత్తములతోఁ
గలయ నొల్లక, మహా ♦ కపటమూని
గీ॥ యతులఁ జూనాడి, మూర్ఖసం ♦ గతి వహించి
తిరుగు పలుగాకి జీవన ♦ స్థితి గణింపఁ
గుకవికృతకావ్యరూపాను ♦ గుణతఁ బూని,
యరసి చూచిన నిస్సార ♦ మగును బిదప॥ 32

క॥ లంజెయును బీఱకాయయు
ముంజెయు బాల్యమునఁ జాల ♦ మోహముగొలుపున్
రంజన చెడి ముదిసిన వెను
కం జూడరు, ముట్టఁబోరు ♦ గద నరు లెందున్॥ 33

చ॥ పలువలు చెంతఁజేరి యొక ♦ పాతికనేబులు చేతి కిచ్చి, ఛీ!
మొలఁగల బట్టవిప్పి తగ ♦ ముందుగఁ భాన్పున నుండి వార లే
పలుగుఁదనంపుఁ గూటముల ♦ బాధలు వెట్టిన నోర్చి, పూనికన్
గులుకుచు నుండు న ప్పుడుపుఁ ♦ గూటివెలంది కొలంబు పెద్దయే? ॥
సీ॥ పరధనాకర్షణ ♦ ప్రాంతంబు స్వాంతంబు,
వ్యర్థమాయానాదో ♦ వ్యసన రసన,
శఠవిటోచ్ఛిష్టాది ♦ సదనంబు వదనంబు,
పలుబోజుంగుల చొంగఁ ♦ బావి మోవి,
పల్లవభయదక్ష ♦ పాణులు పాణులు,
కుటిలాఘువిశతుల ♦ కోపు చూపు,
కృత్రిమగుణగణ ♦ గేహంబు దేహంబు,
పిదపఁఘంబుల ♦ సెజ్జ బొజ్జ,
గీ॥ పంచసాయకరోగ ప్ర ♦ యాతవిటప
యాతనాదాయమాన ప్ర ♦ యాతవిటప
మదసలిలయుక్తమగు దోని ♦ మలపుదోని
కదుఁ గొనఁగ వేశ్య హేయభా ♦ జనము గాదె? ॥ 35
తే॥ గీ॥ ఇట్టి వేశ్యాకులంబున ♦ దిట్టవైన
నీకు జనియించి యిన్నాళ్ళ ♦ నేక విటుల
బలుతెఱంగుల బాధించి ♦ బహుధనంబు
గూర్చి తిఁక నిప్పుడుపుఁగూడు ♦ గుడువనొల్ల॥ 36
క॥ పట్టి నని నన్ను దయఁ జే
పట్టి యతనిఁ దెచ్చి కూర్చి ♦ బహుభాగ్యంబుల్
గట్టిగఁ గొన నొల్ల; వయో
కట్టిడివి గ దమ్మ, లేచి ♦ కడ కటు పొమ్మా॥ 37
క॥ మాతా! జామాతపయిన్
బూతులపాతలు దీసి ♦ పోయెదు రటవే?

ఖ్యాతా! సద్గుణగణ సం
ఘాతా! పూతా! విలాస ♦ కలనోపేతా! ॥ 38

మ॥ చతురుల్ బుణ్యజనుల్ సదాగుణయుతుల్ ♦ సౌందర్యశోభాసమ
న్వితునిన్ జింతలపాటివంశభవునిన్ ♦ నీలాద్రినామప్రజా
పతి ని ట్లూరక నిందసేసెదవు, నా? ♦ పట్లూనలే; కయ్యయో!
మతి దప్పెంగద నేఁడునీకు జననీ ♦ మాయామయోద్యోగినీ! 39

క॥ ఏలాగున నైనను నే
నీలాద్రినృపాలుఁ జేరి ♦ నెయ్యము మెలర్పన్
లీలాలోలత నుండుదుఁ
జాలును నీ లంజెజాతి ♦ సంబంధ మికన్ ॥ 40

క॥ అని తల్లిమీఁద గనలుచుఁ
గనుఁగొనలను బాష్పవారి ♦ గడువడి జాఱన్
జని నిజశయ్యాతలమునఁ
దను వొయ్యన జేర్చి యతని ♦ దలఁచుచు నుండెన్ ॥ 41

క॥ అత్తఱి జంద్రిని జిత్తజు
డత్తిమహోన్మత్తసాయ ♦ కావళిక్రోధా
యత్తమతి నింప బెం పఱి
పత్తిచిరిగి సిండవిఱిగి ♦ పడి మూర్ఛిల్లెన్ ॥ 42

ఆ॥ వె॥ అర్చి సేర్చి మారు ♦ డారీతి నేచంగ
గూర్చి కూర్చి సాదు ♦ గార్చుకొనుచు
మూర్ఛ దెలిసి తనదు ♦ ముంజేయి యోనిలో
దూర్చి యతనిగూర్చి ♦ దుఃఖపడుచు॥

ఉ॥ హా! యతిసారసుందరత ♦ రాంచితవిగ్రహా! నిన్ను జూచి నే
నాయతమోహపాశవశ ♦ నైతిని; సన్నకసన్న నిప్పుడే
డాయగ వచ్చి నా భగత ♦ టస్ఫుటఘట్టిత పంచసాయకా
మేయశిలీముఖచ్ఛటల ♦ మీటి రమింపుము నీలభూధరా॥ 44

క॥ వారస్త్రీలకు మెచ్చుగు
మారుండ వఁటంచు జనులు ♦ మఱిమఱి నెన్నం
గారూఢిగ విని యుందు; ను
దారవిరహతాప మార్పఁ ♦ దగదే నీకున్॥ 45

క॥ చూచినయప్పుడె పైఁ బడఁ
జూచి మరులుకొంటి వార ♦ సుందరి నగుటన్
నీ చతురకార్యపద్ధతు
లే చొప్పున నొప్పుననుచు ♦ నెంతయుఁ బ్రేమన్॥ 46

క॥ వాచె మొగంబు భగంబును
నీ చరణము లాన యింక ♦ నీ విట నాకున్
గోచరుఁడవు గమ్మ వెసన్
దాచి నృపకుమార! వార ♦ రమణీమారా!॥ 47

క॥ వలరాజుచేత యాతన
బలు వయ్యెను, దాళఁ జాలఁ ♦ బ్రత్యక్షుఁడవై
చెలిమిమి రమింపు మిందున్
గులుకుచు నీలాద్రిభూప! ♦ కోమలరూపా!॥ 48

క॥ చల మేటికి రాకొమరా
బలువుగఁ జూడంగ నాదు ♦ పజ్జకునేగన్
గులు కొప్ప వచ్చి భగము బ
గల దెంగుము చండ్లుపట్టి ♦ కసిదీరంగన్॥ 49

క॥ సొమ్ములు కోకలు రూకలు
దెమ్మని నినుఁ జిక్కుసేయ ♦ దీకొని ఖరబం
ధమ్మున దెంగుము వడిగా
నమ్మము పెక్కేల? వార ♦ నారీలోలా!॥ 50

క॥ చలమేటికి? రమ్మికఁ, గో
మలరూప! పిశంగనేత్ర! ♦ మన్మథబాధల్

తలగంగ మనసుఁ దీరఁగ
బలువుగ దెంగంగ నాడు ♦ పజ్జను వేగన్॥ 51

వ॥ అని మహోన్మాదావస్థచే దేహస్వాస్థ్యంబు లేక చీకాకు పడుచు దుర్గంధబంధురంబై గోరుముక్కునలె ననవరతంబు ద్రవించు చున్న యుపస్థంబు జూచి యుపస్థతో నిట్లనియె

ఉ॥ నమ్మినవేశ్య ప్రాంతమని ♦ పావడ చెప్పి కేగఁ దీసి వైచి చో
క్కమ్ముగ గుద్దక్రింద నొక ♦ కమ్మలదుప్పటి నెత్తి నెట్టి మే
ఘమ్ము నిగుడ్చి పోనీకఁ ద ♦ డాలున నంచులుమోయ దూర్చి నీ
తిప్పిరిఁదీట వాఁ జెప్పుడు ♦ దీనిని తాఁకునగో! యో త్రికోణమా!॥

ఉ॥ ఎందఱు పొందుఁ గూడి నిను ♦ యిచ్చిన నిర్ద్రవమై నితాంతమున్
గెందలిరాకుడా ప్రాయాలు ♦ గీల్కొనఁ బొంగు నుదెంచుమంచు లో
గందకఁ దీటతీటక వి ♦ కానన నొందెదు నీవు దృప్తిగా
మందుఁడు నీలరా జెప్పుడు ♦ మగ్గనువెప్పునో! యో త్రికోణమా!॥

క॥ ఆకా? పోకా? పూకా?
కోకా? మేఁకా మఱేమి ♦ గోని యిచ్చెను తా
నీ కాంతనితో నేనని
పూకా! యీ కరణి నేల ♦ పోరలెద వయమో॥ 55

సీ॥ తురకలమొడ్డలు ♦ దూదేకుమొడ్డలు
గుల్లాపుమొడ్డలు ♦ గొల్లమొడ్డ
లాబోయమొడ్డలు ♦ యలకాపుమొడ్డలు
చాకలిమొడ్డలు ♦ సాలెమొడ్డ
లబెసీలమొడ్డలు ♦ పబువులమొడ్డలు
కాపనమొడ్డలు ♦ భట్లమొడ్డ
లింగిలీజులమొడ్డ ♦ చీడిగమొడ్డలు
పింజారిమొడ్డలు ♦ బేస్తమొడ్డ

గూర్చుండు" మనుచుఁ, బరిపరివిధంబుల మతిదప్పి, నెత్తి గోసిన వేఁపి తెఱంగున, నాలి సాలెపురుపు చందంబున, మగ్గంబులో నాడెడి నాడె కై వడి, మధుపానము చేసిన వానరంబు పోలిక, మావి కఱచునక్క టెక్కున (. బిడుగు మొ)న జనునిచందంబున, మూఁగ లాగున మ్రుల్లె పోయి పొరలు పసుండవిధంబున, ముక్కుచు మూల్గుచు మురికిపిత్తులు పిత్తుచు, మూకుడువంటి మూత్రిద్వారంబు మొగివిప్పుచు, ముడుచుచు; మొగంబు దిగద్రైచుచు, మూర్ఛిల్లుచుఁ జెలియుచు, మోహదాహతి తాపంబుసం దల్లడిల్లుచుండె, నయ్యవసరంబున. ౫౮

క॥ వేంకట సానికి దంతయుఁ
గింకరు లెత్తిగింపఁ దుఃఖ ♦ కీలిత మతియై
కొంకుచుఁ గూతురి నునుప
ర్యంకము చేరంగఁబోయి ♦ హా! హా! యనుచున్॥ 59

తే॥ గీ॥ బిడ్డరో! నీకు మనువుండు ♦ నడ్డగరలు
పెక్కుమారులు తగిలిన ♦ సుశ్రీకవె
మార్చుకొంటివి; యిటువంటి ♦ మనుతినాడు
కలుగఁ దయ్యెను వట్టి దు ♦ ష్కర్మ నొందినే॥ 60

క॥ అరయ సీలన్నపాలుని
పేరును బెంపేమి? యతని ♦ పూర్వులు మున్నే
తీరుననుండిరి? యిూ సిరి
వీరాగ్రణి విజయరామ ♦ విభుఁ డొసగెఁ గదా॥ 61

తే॥ గీ॥ ఇంతెకాని జమీందారు ♦ డే యతండు
పరమ మూర్ఖుండు, బహులలోభి ♦ పాప చిత్తు
డాత్మదాసీరతుడు, వాని ♦ కొస చెంద
నిహాపరసుఖంబులేదు నీ ♦ దేటి వలపు॥ 62

ఆకె నె॥ ఎదురు వెట్టివేడ్క ♦ జదరంగమాడెడు
పగిది నీకుగల్లు ♦ పడుపుగూటి
సౌమ్మొసంగి చేర ♦ రమ్మన్న గైకొను
నట్టివాడు ముఖ్య ♦ పట్టివినుము॥ 63

సీ॥ పండ్లుతోముడు; గుద ♦ ప్రక్షాళనముసేయ,
డమవసనాద్యైన ♦ హరిదినంబు
నంటైనఁగడు నూర ♦ బందిమాంసము లేక
కూడుభుజింపడు ♦ గురుముఖంబు
గాడు. తమ్ములజేర ♦ నీవు సత్కవులకు
వైశ్యుల పెండ్లిండ్లు ♦ వలన వచ్చు
కట్నముల్ తా దురా ♦ గ్రహంబునలంకించి
లంజల కిచ్చును ♦ లజ్జమాలి,

గీ॥ వినయమునఁ, తండ్రి తద్దిన ♦ మునను విప్రు
బిలిచి యొకకాసు తవ్వెడు ♦ బియ్యమీడు
పతితుఁడును; లోభి, ♦ చింగలపాటి నీల
రాజు. ఛీ ఛీ యతని మీద ♦ మోజదేల॥ 64

ఉ॥ ప్రాచిన శాల్మలీద్రుమముఁ ♦ బోలిన లోహిత దీర్ఘదేహమున్
గాచనమూనపీతరుచిఁ ♦ గ్రాలెడు కొంచెపు గన్నుదోయి, జ్యే
ష్ఠాచపలాక్షి ప్రేలెడు వి ♦ శాలతరాస్యము గల్గువాని సం
కోచము లేక చూచి వల ♦ గొంటివె? వారవధూశిరోమణీ॥ 65

క॥ సానులకు గబ్బిబెబ్బులి
ప్రాని కనుంగొనినవాడు ♦ పోనీడుగదే
హానియొనరించు హా! రతి
కూన! సరగఁ బాటిసొమ్ము ♦ కొట్టామునకున్॥ 66

తే॥ గీ॥ నల్లమందును గంజాయి ♦ కల్లుగోతు
పిచ్చుకలల మెక్కి నిను వాడు ♦ పిత్త దొంగు
పెచ్చినిగిన విడువడే ♦ పాపి, వాసి
దుష్టువలెనుండు మొద్దుకై దుంగలెత్త 67

క॥ కుత్తయు పత్తయుఁ జినఁగగ
మొత్తును మత్తిల్లి, నీదు ♦ మొద్దును దండల
మొత్తను మని వేడిన వినఁ
డత్తులువ బొజుంగు, వాని ♦ కాసింతురటే॥ 68

క॥ పాపీ! విను వట్టియాసలు
చూపియ్యడు డబ్బు లంజె ♦ సొమ్ము భుజించున్
పాపాత్ముఁడు పశుకర్ముఁడు,
మా పని చే పని భ్రమించి ♦ మగ్గము నెక్కెన్॥ 69

క॥ పిచ్చలు వడివడి రాయగ
గుచ్చులు మెచ్చ్యంగవాడు ♦ గొనకొని తారుణ్
గచ్చంత పగిలి సలుపుచు
జచ్చేవే చంద్రరేఖ ♦ సాంద్రసురేఖా॥ 70

క॥ పెద్దల చెలిగడు మాటలఁ
బద్దులు పచరించు గర్వి ♦ భామకురతిలో
నెప్పువలె మెలఁగు నీ కా
బుద్ధులను మానుమమ్మ ♦ పుత్తడి బొమ్మా॥ 71

క॥ ఖలుడైన నీలవృపు డీ
యిలపై నిన్నాళ్ళు బ్రతుకు ♦ నే? నరసాంబా
గళకలితకనకమయమం
గళసూత్రోత్కృష్టమహిమఁ ♦ గాక కుమారీ॥ 72

తే॥ గీ॥ గొక్కమిచ్చెడు విటుఁ జూచి ♦ దక్కవల్లు
తక్కుచును బొల్లిమాటల ♦ దనుపుఁగాని

నిక్కముగ మానసం బీయ ♦ నిశ్చయించి
వారకన్యక యీరీతి ♦ వలచు నటవె? 73

క॥ ఎక్కడి నీలాద్రిన్నృపుం
డెక్కడి యడియాస? వలపు ♦ లివిగూడ నికన్
గుక్కిక్క నేను తెలుంగున
నెక్కరు మసకండ జనుము ♦ గేహంబునకున్॥ 75

వ. అని వినయవిస్రంభగంభీరసంరంభంబులుగుభింప వలుకు నచ్చిలుకల కొలికి కంతుకాంతకు వింతవింతలుగ దురంతనితాంతవిప్రలంభవేదనాభరంబు భరింప రాకుండఁ గరంబు దళంబుగాఁ బరవశత్వంబునొంది మాఱుమాటాడ నోడి, యోడిన కోడిచందంబునఁ దల వ్రేలవైచుకొని, కదల మెదలనేరక కన్నులుమూసుకొని యారకశరీరంబు నీరు విడునశయ్య నొయ్యనవ్రాలి తూలంగనుంగొని బెంగనులోంగి దుఃఖాంభోధిమధ్యంబున మునింగి కన్నీరు లేరులై పాఱి వెల్లివిఱియ జిల్లపడి తల్లడంబున నుల్లం బవిసి మెల్లమెల్లన నప్పల్లవమనోభూతంబున కాతతగతిఁ జల్లనిపనులు సేయం దలంచి తన దాసికాజనంబులుం దానును దాని నిజశయ్యాతలంబునం జేరె.

సీ॥ భగమధ్యమున మంచి ♦ చిగురుప్పగూరించి
పై గొండనల్లేరు ♦ ప్రస్తరించి,
లంజనస్తన ప్రదేశంబున రేవడి
దూలగొండిచిగుళ్ళు ♦ గీలుకొలిపి
కన్నులలోనన ♦ రక్తక్షీరమునించి
ముక్కుగూండ్లను నావ ♦ ముద్దలుంచి
వీనులలోపల ♦ వేడినూనియ పోసి
నాలుక జెముడుపా ♦ ల్పాల బొడిచి,

గీ॥ మన జూసున్నమెంతయు ♦ మెత్తి, నెత్తి
గొఱిగి, నిమ్మపులుసు గంట్ల ♦ గ్రుమ్మిలోప

కిముడ నేపాళము లోసంగి ♦ యిట్లు శిశిర
కృత్యములు సేయు, నప్పుడ ♦ క్కితవవనిత॥ 76

క॥ బడబడఁ బిత్తులు పిత్తుచు
బడిబడి బహుభంగి మీఱఁ ♦ బాఱుచు మఱి తా
నొడ లెఱుఁగక పెను మూర్ఛం
గడు సోలఁగఁ, దల్లిగాంచి ♦ కటకటపడుచున్॥ 77

ఉ॥ వేంకటసోమయాజి కిది ♦ వేగమెఱుంగఁగఁ జెప్ప కుండిసన్
గింక వహించి దుఃఖపడుఁ ♦ గేవల మాతఁడె దీనిఁ గన్నవాఁ,
డెం కిట నుండనేల? యని ♦ యేడ్చుచు నాతనిఁ జేరి యంతయున్
జంకక చెప్ప, నాతడును ♦ సంభ్రమదుఃఖభయార్ద్రచిత్తుఁడై॥ 78

తే॥ గీ॥ వెఱ్ఱి లంజెవు, కా కున్న ♦ విషమబుద్ధి
శిశిరకృత్యంబు లీ రీతిఁ ♦ జేతు వటఁవె?
చల్లయును నన్నమును బెట్టి ♦ నల్లమందు
లోని కిప్పించి చేయింపు ♦ తాన మిపుడె॥ 79

క॥ ఈ చందంబునఁ జేసిన
నీ చిన్నది బ్రతుకు నిపుడు ♦ నిక్కము, దానిం
జూచెద నన గ్రతు వ్వానితి,
నీ చోటుం దరలి రాగ ♦ నిది చెడును గదా॥ 80

ఉ॥ చన్నుల జందనం బలఁది ♦ జానుల నంటి చిగుళ్ళు గప్పి వా
ల్గన్నులఁ గప్పురంపుఁ గలి ♦ కం బిడి, బాహువులందుఁ బొందుగా
దిన్నని తూండ్లు జుట్టి, నును ♦ దేనియ మోవిని జిల్క, వేగమే
చిన్నది తెల్వి నొందు నిఁక ♦ చిత్తములో వగఁబూన నేటికిన్॥

క॥ అది లెస్సగ నున్నంతట
ముదమున నీలాద్రిరాజు ♦ మోహంబున నీ
సదనమున కరుగుదెంచును,
పదపడి మన కిరవురకును ♦ భాగ్యము లిచ్చున్॥ 82

క॥ వస్తాఁడు నీలభూపతి
తెస్తాఁడు ధనంబు, నీ క ♦ తిప్రమదముగా
నిస్తాఁడు విరహవేదనఁ
జస్తాఁడా? నమ్మ మదిని ♦ సందియ మేలా॥ 83

ఆ॥ వె॥ అనుచుఁ దెలియ జెప్ప ♦ నామోదహృదయయై
సరగ నరిగి యట్లు ♦ సఖుపఁ జంద్ర
రేఖ రేఁగుఁ బువ్వ ♦ వైఖరి దెల్వచే
వలపు గులకరింప ♦ నలరు చుండె

క॥ నీలాద్రి నృపుం డచ్చో
సోలుచు విరహానలా ప్త ♦ స్రుక్కి వగచుచుఁ
జాలిం బొందుచు నేడ్చుచు
వాలారుచు నింక నేటి ♦ వల పనుకొంచుఁ॥ 85

సీ॥ దాని జఘనయోని ♦ లో నటించని మహో
ద్దండదర్పిత కామ ♦ దండ మేల?
దాని కోమలసుధా ♦ ధరము గ్రోలని మధు
రసరుచివ్యాలోల ♦ రసన మేల?
దాని లంబస్తన ♦ తాడనం బబ్బని
వరకవాటోప మ ♦ వక్ష మేల?
దాని జానియుగమ ♦ ర్దనము సేయని దీర్ఘ
దర్వీసమాన హ ♦ స్తంబు లేల?
గీ॥ దాని నిర్భర మధుమదా ♦ హీనదేహ
గాఢపరి రంభసంభోగ ♦ కలన లేని
భూరివిస్తార శాల్మలీ ♦ భూజతుల్య
పుష్టియుత ఘనమద్దేహ యష్టి యేల? ॥ 86

క॥ దానిని మక్కువ దొడపైఁ
బూని కనుంగొనిన రాజ ♦ భోగం బేలా?

యీ నెఱవయ సేలా? యని
మానని చింతాభరమున ♦ మఱుగుచు మఱియున్॥

ఉ॥ చందురుకావి పావడయు, నైకపుబంగరు వ్రాతచీరయున్
ముందల కుచ్చుగచ్చు, తెలి ♦ మొగ్గలకంచెల, మించుచేమపూ
గుందనపుంగడేలు, వగ ♦ గుత్కడి క్రొమ్ముడి, పట్టుబొందు, సొం
పందెడు దానిమేనుసొబ ♦ గద్దిర! నామదిం గొల్లలాండెడిన్॥ 88

వ॥ అని దురంతచింతాక్రాంతస్వాంతుండై. 89

సీ॥ గ్రుక్కు త్రిప్పును, బంట్లు ♦ కొఱుకును మూల్గును,
నీల్గును మిగుల గ ♦ న్నీరు నించు
అసురుసురను, పింగు ♦ పిసికికొనును, నోరు
మోదుకొను, గ్లంజె ♦ సుంత గుబటె
కేలవచ్చెను? దాని ♦ నేలచూచి విరాళి
చెందితి? ననుకొనుc ♦ జెడితి; ఒడితి
నెవ్వరి బంపుదు? ♦ నే రీతి నదివచ్చు?
నేమి సేయుదు దైవ ♦ మిట్లు వెతల

గీ॥ పాలుగాc జేసె; సాటి నృ ♦ పాలకోటి
లోన నగుబాటులయ్యెc గా ♦ లూన రాని
విరహపరితాపభరమున ♦ వేగ దరమె?
యంచు బలవించు దలపంచు ♦ నార్తిగాంచు॥ 90

సీ॥ తమలంబు తినడు, జో ♦ గము వారినాడెంపు
దన్నంబు కుడువండు ♦ సన్నవెన్న
కోకలుగట్టడు ♦ కొలువుకూర్చుండడు
జలకమాడడు గంద ♦ మలదుకొనడు,
వేపులతో దాను ♦ వేటకు బోవడు
ననుపుకత్తెలగూడి ♦ నవ్వుకొనడు

వేంకట ముఖిముఖ్య ♦ నిధిగనుంగొనడు భా
గవతుల వేషమై ♦ ఖరులు గనడు

గీ॥ కిట కటా! చంద్రరేఖావి ♦ కటకటాక్ష
వీక్షణాక్షీణవాతూల ♦ విజితదేహ
భాలభూరుహము డగుచున్న ♦ నీలనృపుడు
పరవశత లేచి, వనలతా ♦ తరుల జూచి॥ 91

క॥ కమ్మవిలుకాని తూపన
నమ్మఖశాలాంగణమున ♦ నగపడి చని నో
యుమ్మెత్తకొమ్మ! నీవా
క్రొమ్మెత్తని. సేనిసాని ♦ దుమ్మంగనవే! 92

క॥ వింటివో లేదో శుకకపు
దంటెమువలె బిఱ్ఱిబిగిసి ♦ తలగని వలపుం
గొంటెని గనినది మొదలుగ
తంటెపుమోకా? యిదేమి ♦ తబ్బిబ్బొకా? 93

ఆ॥ వె॥ కప్పు విప్పుగలుగు ♦ గొప్ప కొప్పులరారు
నప్పులంతిచొప్పు ♦ త్రిప్పకిప్పు
డొప్పు మీఱ మీరు ♦ చెప్పరే గుప్పున
మెప్పు లిత్తు నప్పి ♦ తుప్పలార! 94

క॥ మీఱిండ రొకటిమై పొలు
పారం దిటమూనం బల్కి ♦ యతిరయమున నో
కోరింద డొంకలారా!
సాకేందుముఖీలలామ ♦ జాడ దెలుపరే! 95

క॥ మారార్తి నెంత వేడినం
మారాకడ దెలియ జెప్పి ♦ మాటాడ రయో
జోరీగలార మీరా
నారీరత్నమును దెచ్చి ♦ నాకొసంగరుగా? 96

క॥ చింతలపాటి కులీనుఁడ
చింతాసంతాపచలిత ♦ చిత్తుఁడ నిను నే
జింతామణిగా నెన్నెద
జింతా! యక్కాంత తెరువు ♦ చెప్పుము నాకున్॥ 97

సీ॥ వ్రణకిణాంకితయోని ♦ గణికాలలామ నా
లోకింపరే తుమ్మ ♦ మ్రాఁకలార !
తుంబీఫలసమాన ♦ లంబమానోరోజఁ
బొడగానరే బట్ట ♦ కదుకులార!
యింగాలపుంబళ ♦ శృంగారతరకేశ
పాశ నీక్షింపరే ♦ పాశలార !
క్రకచదంష్ట్రాంకురా ♦ గ్రిమ్ముమత్త్వసంయుక్త
దేహగాంచరె తిప్ప ♦ తీగలార !
గీ॥ ఉష్ట్రరదనచ్ఛదోపమా ♦ నోష్ఠబింబ
నీడ జూడరె మీరారు జి ♦ ల్లేడులార !
మృత్కళసమానవిపరీత ♦ మధ్యజంద్రి,
గాంచరే నిక్కముగ నేఁడు ♦ గారలార ! 98

ఉ॥ పోడుల మ్రోడులార! కడు ♦ బూసిన పీతిరితుమ్మలార! బల్
బాడిద చెట్లలార! ఫల ♦ భాగ్యవిముక్తకుజంబులార! యా
వేడుకకత్తె చిత్తమున ♦ వేడుకమీఱఁగ వేగిరంబు మీ
నీడకు నీతకొక్క సర ♦ ణింపుఱ తెంచదుగా వచింపరే॥ 99

క॥ బెండా! మూర్కొండా! యా
దొండా! మీయందకెపుడు ♦ తోరముమీరన్
దాండవమాడుచు మేలిప
సింహం జెలచంద్రిరాజె ♦ చెచ్చెర జెప్పుఁడా॥ 100

క॥ నాకెద లోపల వి[illegible]ము
చిచాకుగఁ జేయఁ జొచ్చె ♦ జెచ్చెర నిపుడో

కాకీ! ఘూ! కేకీ!
పూకీ దిగుమేనిసాని ♦ గోడజూపరుగా॥ 101

క॥ కృకవాకులార! మాద్య
త్కృకలాసములార! గవయ ♦ కిశశశశునీ
వృకజాతులార! బోగపు
సకియలతలమిన్నఁ జంద్రి ♦ సానింగనరే?॥ 102

క॥ ఉరుతాపకరణ కారణ
వగతామరసాశుగములు ♦ వైచిమరుమ, వి
స్ఫురితాంగిఁ జూపు మిపుడో
యురుతా! మామాట సేయ ♦ నొప్పిన గోరతా?॥ 103

క॥ పందీ! నీగాత్ర సదృ
క్సౌందర్యకళావిలాస ♦ చంచన్మురజి
న్మందరమందిర యగునా
యిందీవరపత్రనేత్రి ♦ నిటుచూపగదే॥ 104

క॥ నీ తీరు గలుగు రూపము
చేతఁ విటకోటి నవయఁ ♦ జేయుచు గడకన్
బౌతర లాడెడిపడుపుం
గోతిని వీక్షించినావె? ♦ కోతీ ప్రీతిన్॥ 195

క॥ కల్లు కడు దాగివి ప్రేలుచు
హల్లీసక మాడుకొనుచు ♦ నడియిచ్చటికు
ద్యల్లీల రాదె? బల్లీ!
పిల్లీ! కడు ముద్దులిలుకు ♦ పిల్లలతల్లీ!॥ 106

క॥ నీలాద్రి రాజనాముడ,
వాలెంబునదానిఁజూచి ♦ వలచితినేడా

స్థూలోపస్థాన్వితగణి
కాలలనన్ జంద్రరేఖ ♦ గంటివె? ఖరమా॥ 107

వ॥ అని మఱియును 108

చ॥ మనసిజమాయలం దగిలి, భ్రామకుల దుష్టుల పక్షిజాతులన్
వనమృగకోటులం దలఁచి ♦ వారక యీగతి నేఁడి, వేఁడినీ
రు నయనపాళి జాలుకొన ♦ రోదన మెంతయు జేసికొంచు, బూ
చిన విషముష్టిభూరుహము ♦ చెంగట నీలశిలాతలంబునన్॥ 109

క॥ చేరి కళేబర మచ్చోఁ
జేరిచి, హా! చంద్రి! నాకుఁ ♦ జెప్పక పఱివం
గారణమేమి? మ తెవ్వని
కోరిక దీర్పంగఁ దలఁచు ♦ కొంటివొ చెప్పుమా॥ 1:0

క॥ కోకలు రూకలు నాకులు
పోఁకలు మేఁకలును బట్టు ♦ బొందులు సొమ్ముల్
నాకంటె మిక్కిలిగల
రాకొమరుఁడు గలడె యీధ ♦ రావలయమునన్॥ 111

క॥ చక్కనివాఁడ, రభసమున
కుక్కుటమార్జాలశునక ♦ కూర్మ రతులచేఁ
జొక్కింపంగలవాఁడను,
జిక్కులు పెట్టంగ నీకు ♦ జెల్లునె? చంద్రీ! 112

క॥ రమ్మా, నా యభిమత మిఁపు
డిమ్మా, యిమ్మాడ్కి నేఁచ ♦ నేటికి? పొన్నుల్
గొమ్మా సమ్మతి నిచ్చెదఁ
గొమ్మా! వెలముద్దుగుమ్మ! ♦ గుబ్బలగుమ్మా॥ 113

ఉ॥ జాలము చేసి మానకి ♦ జాలము పాలుగఁ జేయ నాయమా
తాళఁగఁజాల, ని విరహ ♦ తాపభరంబు కరంబు హెచ్చె, నీ

తాళపలోపమానసము ♦ దగ్రకుచద్వయ మక్కుజేర్చి లీ
లాలలితోపగూహన క ♦ ళాకలనన్ సుఖియింపఁ జేయుమా॥ 114

శా॥ శోషింపన్ మదనోపతాపమున న ♦ క్షుద్రోన్నతస్థూలని
స్తోషోద్వృత్తనుయష్టి, పుష్టిగను మం ♦ దుల్ చేసినన్ గా, దహో
రోషం బూనక నేఁ డపారకరుణా ♦ రూఢాత్మవం కేజ వై
యోషిద్రత్నమ! చంద్రి నీ యధరపీ ♦ యూషంబు నాకీయవే॥

క॥ పెక్కుతెఱఁగుల నీకున్
మ్రొక్కెద, జల మేల? నాదు ♦ మోహము దీఱన్
జక్కురవిల్తుని కూటమి
మిక్కుటముగఁ దేల్చి యేలు ♦ మీ దాసునిగాన్ 116

క॥ మే లెంచెద, సామ్రాజ్యం
బేలించెదఁ, దొంటిసతుల ♦ యెల్లరకంటెన్
లాలించెదఁ, బాలించెద,
దేలింపుము రతుల నన్నుఁ ♦ దేకువ మీఱన్ 117

క॥ చక్కెరనిల్తుని బారిన్
జిక్కితి, నీ పాదయుగకు ♦ కేశయములకున్
మ్రొక్కితి దక్కితి, నిక నీ
నిక్కులు దిగద్రొక్కి నన్ను ♦ దయ జూడగదే॥ 118

తే॥ గీ॥ గంధ మత్తరు జవ్వాది ♦ కస్తూరియును
దొడ్డ యొడ్డాణమును గమ్మ ♦ దోయి క్రొత్త
పట్టుచీరలు కుచ్చుల ♦ బావిలీలు
రొక్క మివె గొమ్ము నీ లంజె ♦ టక్కు మాని॥ 119

తే॥ గీ॥ తాళజాలను, వింత ♦ జాల మేల
చేసెదవు? నన్ను మిక్కిలి ♦ చెలిమిరతుల
నేలుమీ వేగ మా టాడి ♦ ఫాలలసిత
సరసనవ చంద్రరేఖ యో ♦ చంద్రరేఖ॥

ఉ॥ తియ్యని ముద్దుమాటలును ♦ దేవియ గాఱెడు బాల్యమోవియున్,
బయ్యెదకొంగులోఁ బొదలు ♦ బల్చనిగుబ్బలు, మంగలంబుతో
గయ్యముసేయుమోము, నులి ♦ గన్నులు, తోరపుగౌను నాకుఁజూ
పియ్యెడ మారుకేళి గడు ♦ నేలుము, జాలముసేయ కింతయున్॥

మ॥ అమలంబై, తరుణారుణద్యుతిసమే ♦ తాశ్వత్థపత్రాభమై,
రమణీయస్ఫుటదీర్ఘలింగయుతమై, ♦ రంగద్వ్రివోపేతమై,
సమమై, రోమవిహీనమై, వెడదమై, ♦ జానొప్పు నీ మారగే
హము, నా కర్మిలిఁజూచి ప్రౌఢరతినో ♦ ల్లాడింలు చంద్రీ, దయన్
వ॥ అని మఱియును. 1.3

ఉ॥ హా! యనుఁ, జంచరీకనిచ ♦ యాంచిత కుంచితరోమకామగే
హా! యనుఁ, దానమానిత మ ♦ హాద్విపమోహన మోహనైకబా
హా! యనుఁ, గంక కాకమహి ♦ షాశితదుర్భర నిర్భరాతిదే
హా! యనుఁజంద్రి! తాళినహ ♦ హా! యను భీతశిరోరుహా! యనున్

ఉ॥ డాయఁగ రాకు నన్ను మరుఁ ♦ డా! యను, నేఁచగ నేల రిక్కఱేఁ
డా! యను, వద్దువద్దు చనుఁ ♦ డా యను, సోఁకక పొమ్ము గాలిపీ
డా! యను, చంద్రితల్లి వఱ ♦ డా యను. వేంకటశాస్త్రి నేఁడురాఁ
డా! యను, కూతుగూర్పదగ ♦ డా యను, నేగతి దేవుడా యనున్



క॥ ఆకరణి నడిచి డేరా
మేనవలెన్ బిఱ్ఱబిగిసి ♦ మిట్టిపడు నిజా
స్త్రీకసుమకామదండముఁ
జేకొని చీఁకుచును బుద్ధిఁ ♦ జెప్పఁ దొడంగెన్॥ 196

ఉ॥ చాపల మోపు చంద్రి నిను, ♦ జక్కఁగ జక్కెరవింటిదంట పెన్
గాపురపింటిలోపలికిఁ ♦ గ్రక్కున దూరి సుఖింప కుండ నం
తాప మొసర్చి యేఁగె నటు, ♦ తాళు మటన్నను దాళకేల యు
ద్యాపనశక్తిఁ జూపెదవు ♦ దండము నీకు మనోజదండమా॥ 127

ఉ॥ గచ్చులు మెచ్చు లచ్చెరువు ♦ గా గడిలన్ వెదఁజల్లు చంద్రిబల్
పచ్చనితొక్కుదోయి గల ♦ పక్కి హుమాయివజీరు నింటిలోఁ
జొచ్చుచు వచ్చుచున్నిగుల ♦ జొక్కుచు గ్రీడ యొనర్చుచుండఁగాఁ
నిచ్చలు దృష్టి జేసెదను ♦ నిల్వవె కొంచెమసేపు దండమా

ఉ॥ పెక్కు తెఱంగులం గరని ♦ పీడన మే నొనరించి వంచినన్
స్రుక్కక మిట్టిమిట్టి కల ♦ జూపుచు సన్నపంచె జించుచున్
మొక్కులపాటు జూపెదవు ♦ మున్ను ద్రికోణము లెన్ని జూపితిన్
బ్రొక్కెద నిక్కమౌను మతి ♦ మూర్ఖమనోభవ దీర్ఘదండమా॥

ఉ॥ కాయలు గాచె నీదు కల ♦ కానియెహా సుకుమారవారక
న్యాయతకచ్ఛపోపమధ ♦ గాంతరనిత్యగతాగతక్రమో
ద్ధేయసముగ్రఘట్టన వి ♦ శేషకరాపద నైన నింక నో
కాయజదండమా! వినుము ♦ నైకొని యూరక నుండలేవుగా॥

ఉ॥ పంకము లంటు నాకు ఒకరు ♦ భంగుల నీ కతన న్విలాసవ
త్పంకజపత్రినేత్రలను ♦ బల్మిని బట్టగ దద్విశాలమీ
నాంకగృహాంతరాళభరి ♦ తాత్మజలప్లుతపాంశుసమ్మిళ
త్పంకము నీకు నంటు గద ♦ పాపపు మేధ్రమ! యిట్లు నేతురే॥

ఉ॥ ఎందఱి వేడుకొంటివి? మఱి ♦ మొందఱిపాదము లంటుకొంటివో? ముం
దెందఱి నాశ్రయించితివి? నిఁ ♦ కెందఱికిన్ బ్రణమిల్ల జేతువో?
కొందల మందెడి న్మనసు ♦ గొబ్బున నా మన వాలకించి, యా
బందెలమారి చంద్రి భగ ♦ భాగ్యము గోరకు మారదండమా॥

సీ॥ కమలపత్రస్ఫూర్తి ♦ గనవట్టు భగములు
మించుటద్దమ్ముల ♦ మించు భగము
లశ్వత్థపాండుద ♦ ళాకారభగములు
పనసతొనల ♦ బోలు ♦ ఘనభగములు

దిండెసప్రావుల ♦ వంటి భగంబులు
నీతగింజలరీతి ♦ నెసగు భగము
లలపందిముట్టెల ♦ వలె నుండు భగములు
కాకిపిల్లలనోళ్ల ♦ గతి భగములు
గీ॥ పెక్కు జూపితి నీవును ♦ నిక్కు కొనుచు
నన్నిలోడవెట్టి వెడలితి ♦ వకట! యిపుడు
చంద్రిభగమేమి! భాగ్యమా! ♦ ప్రేపుమాము
డుంగులింగమా! చాల పా ♦ డుంగు మాని॥ 133
క॥ తులువలు నడినడి దాకఁగ
లలిఁ జీనిఁగిన పూకు దెంగు ♦ లను వెఱచుచనె నీ
తలబ్రద్దలగును దానిం
దలచి నిగుడ బోకు ♦ దండము యింకన్॥ 143
సీ॥ కొం కేది బానిస ♦ గుడిసెలు దూఱుట
పరికించి చూడ నీ ♦ కొఱకు గాదె?
బత్తిని దొమ్మరి ♦ తొత్తుల నిల్పుట
గొనకొని యున్న నీ ♦ కొఱకుఁ గాదె?
సోడిగలను గొని ♦ గూనుల గప్పుట
కొంచ కెంచఁగ నీ ♦ కొఱకు గాదె
బాలవిధవలకు ♦ నోలి మాన్యము లిచ్చు
టరసి చూడఁగ నీ ♦ కొఱకుఁగాదె
గీ॥ వారకన్యకలకు నే న ♦ వారితముగఁ
గోకలును సూక బెడుట నీ ♦ కొఱకుఁగాదె
సూళలకు మూను బెల్ల నీ ♦ కొఱకు గాదె
మోముకారోత్సవమా శాంత ♦ మూనుకొనుము॥ 135

ఉ॥ తేసియకంపుపెంపు గల ♦ తేజము ఝల్లున బెల్లువారగా
గోవెలలీలదేరు చను ♦ గొండలు సిండయు దాండవింపఁగా
గానుగఁగోలుబోలు మెఱు ♦ కంపిలఁ బైకొని మేఢ్రదండమా
దాని పకారకొమ్ము వెడ ♦ దాకగ వ్రక్కలు సేయుచున్నడో॥

ఉ॥ కుక్కుటమాళికా భగన ♦ గొల్లి నఖంబులగిల్లి మెల్లనే
చొక్కపు మన్మథాలయము ♦ జుంబన మొంతియుజేసి దానిలో
గ్రక్కున మోవిగూర్చి వగ ♦ నైకొని పీల్చిన జంద్రిమిక్కిలిం
జొక్కి రమింప సిచ్చుఁగద ♦ సొంపుగ నో లినదా! తడాలునన్॥

శా॥ ఆభూతాకృతిచంద్రినాంద్రతరరో ♦ మాంచత్రికోణంబులో
నాభోగోస్ఫుటవంశతాండవమహో ♦ వ్యాపారకేళీకలా
లాభం బందెదనంచు నిక్కెననే ♦ లాసారె గారించెదో
శోభస్తంభమ దానికాం డెసవలెన్ ♦ సిద్ధించు నీకిస్త్రరిన్॥

ఉ॥ గొల్లెనకంభమంతి నిడు ♦ గొల్లి, చోకారపు నల్లతీగెల
ల్లల్లికగొన్న రోమములు, ♦ నద్రిగుహోపమ మూదిలంబునన్
దెల్లని కొటిప్రేగెంజె పస ♦ మించు ద్రవంబును గల్గుదంద్రి మా
రిల్లెపు డివ్పసొచ్చెదవొ ♦ హెచ్చరికన్ బహుదీర్ఘ శిశ్నమా॥ 39

ఉ॥ నీచతకోర్చి బంధుజన ♦ నిందకుఁబోయక దొల్లిగాథబిన్
జూచియు నీవు మిట్టిపడ, ♦ జొచ్చిన నీచపలంబు దీర్చగా
లోచితవృత్తిఁ గైకొనియు నొన్సకమీఱగ దావి యోనిదూ
రించినవాడ గాదె! నిను ♦ రిత్తగజేయక నాదు మేఢ్రమా॥

చ॥ వినువిను వస్తువస్తు యు ♦ వివేకము బూనకు జంగ్రిపూకుపై
మనసిడ కంచు జెప్పినను ♦ మానక మిట్టిపడేవు జొచ్చినన్
ఘనమగు పుంస్త్వమున్ సెగయు ♦ గడ్డలు నంటిచెడేవు మానుమీ
యనుపమరూపనిర్జితమ ♦హాగజదండమ!మారదండమా! 141

వ॥ ఇట్లనేక ప్రకారంబుల మనోవికారంబుచేతం జేరినా చేతస జ్ఞానవిహీనుండై యాసీలాద్రిరాజన్యశతమన్యుం డుద్దండంబుగ దండనుండి గంచుకొని వచ్చు కుసుమాయుధవిధుమలయాచల సమాగతవాతపోత మధువ్రతపరభృతశారికావారంబుల గుఱించి దూషింపఁ దొడంగె.

క॥ మదనా! మదనాశుగచయ
మదనా! చెలరేగి యేయు ♦ నాతని శశభృ
ద్వదనా! మృదులోపస్థా
సదనా! యెద నాటె నిపుడు ♦ శంభరమథనా॥ 143

తే॥ గీ॥ సకల పూరుషహృదయాబ్జ ♦ సంఘటించు
సాని నీ చంద్రరేఖాభి ♦ దానమూని
కేరుచున్నది, దానిపైఁ ♦ గినుకమాని
తద్విరహి నన్ను నేఁచంగ ♦ దగునె చంద్ర?॥ 144

క॥ ఫణిరోమరేఖ మెఱుగు న
గ్గణికాంగనమీఁద బోవ ♦ గా నెఱచి, సమీ
రణమా! మము నేచగ గా
రణ మేమి? తలంగు సత్వ ♦ రతసద్భుజగేన్!॥ 145

ఉ॥ మిమ్ము జయించు మీచుగల ♦ మేలినునంద బెనుగొప్పుచేతనే
మిమ్ము మనోభవప్రకట ♦ మార్గణజాలముపాలు చేసితాఁ
గిమ్మనకేగె, దానిదరి కేగెరరు, చంపకగంధి యంచునో
తుమ్మెదలార! నీఱిచటఁ ♦ ద్రుమ్మెదరక్కలు! శౌర్యహీనులై॥ 146

క॥ ఆ వెలపొలంతిఁ గని నే
నేవలవిహారిత్రచేతఁ ♦ గృశియించెడిచో

నీవు చెవుల్ చిందఁజగొనఁ
గోవెల! కూయకుము నిన్ను ♦ గొఱుకన్ వేయన్॥ 147

క॥ పరపురుషాన్యం బంతయు
హరియించుచు నేఁచు చంద్రి ♦ యంచితబింబా
ధర మాని సుఖియింపక, త
త్పరవశు నను నేఁచ నేమి ♦ ఫలమగు? జిలుకా॥

చ॥ అని యనివార్యమానమద ♦ నాపదచే సకలప్రపంచమున్
దనువును బేరునున్ మఱచి ♦ తన్మహనీయవియోగవార్ధిలో
మునుగుచుఁ దేలుచున్, బరమ ♦ మూర్ఛితచేఁబలవించుకొంచు,న
జ్జననరపుంగవుఁడు కడు ♦ సత్త్వము పెంపు దొఱంగిమూర్ఛిలెన్॥

తే॥ గీ॥ అనుచు శ్రీనంబి నారసిం ♦ హార్యవర్యుఁ
డానతిచ్చిన, శివభూసు ♦ రాగ్రగణ్యుఁ
డైన వీరన విని యద్భు ♦ తాత్ముఁడగుచు
బిదప కథజెప్పఁ డతులిత ♦ ప్రీతినుడు॥ 150

క॥ మారాకారా! కారా
రాగాంతర విహరణోగ్ర ♦ కర్మఠ! పారా
వారావృతధరణీతల
వారవధూజాల! నిత్య ♦ నగ్నతసీలా!॥ 151

మాలిని:—హరిగుణగణఖేలా! యంగజవ్యాధిలోలా!
పరిచితవిటజాలా! బాలరండానుకూలా!
నిరతరచితకాలా! నీసదాసేయపాలా!
దురితచయవిశాలా! దుర్గుణౌఘాలవాలా! 152

— గద్యము. —

ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధ సరసకవితా
విచిత్ర సలలితాపస్తంబసూత్ర కౌండిన్యసగోత్రకగాధిమంచికుల
పవిత్ర గంగనామాత్యపుత్త్రి మానితానూన సమానానా
విధరంగత్రిలింగదేశభాషావిశేషభూషితాశేషకవితావిలా
సభానురాఖర్వసర్వలక్షణ సారసంగ్రహోద్దామశుద్దాం
ధ్రరామాయణ ప్రముఖబహుళప్రబంధ నిబంధన
బంధురవిధాన నవీనశబ్దశాసన బిరుదాభిరామ
తిమ్మకవిసార్వభౌమసహోదర గురుయశో
మేదురవివిధవిద్వజ్జనవిధేయజగన్నాథ
నామధేయప్రణీతంబైనచంద్రరేఖా
విలాపం బను హాస్యరస ప్రబంధ
రాజంబునం ద్వితీయా
శ్వాసంబు
సంపూర్ణము.

శ్రీరస్తు.

# చంద్రరేఖావిలాపము.

## తృతీయాశ్వాసము



రతిపతి మనోహర
చారుతరగృహాయమాన ♦ శష్పావృతవి
స్తారభగాన్విత చంద్రీ
నీరంధ్రాశేవ్యలోల! ♦ నీలనృపాలా॥ 1

వ॥ ఆకర్ణింపుము తావకీన కథావిధానంబు, యథార్థంబుగాఁ బొల్లి శ్రీశివబ్రాహ్మణవర్ణాగ్రగణ్యుండైన వీరభద్రాభట్టారకేంద్రునకు శ్రీమద్వైఖానసవంశోత్తంసం బగు నరసింహాచార్యవర్యుం [illegible]వ్వలి కథ యిట్లని చెప్పం దొడంగె. 2

క॥ అంతటఁ బటఘటితగృహా
భ్యంతరమహీమానుపుష్ప ♦ బంధురబలవ
ద్దంతయుతశయ్య సమ్మహి
కాంతుడు లే కున్న దాసి ♦ కలుడాసి కదుఁగ॥ 3

క॥ కళవళ మందుచు, మన మిట
గొలగొల మనుకొంచుఁ జుట్టు ♦ కొని యుండఁగఁ గో
మలగతి నేడకు జనెనో?
తెలియ దహా! దైవమాయ ♦ తీ రెట్లగునో॥ 4

సీ॥ పిక్క లూరులు కాళ్ళు ♦ పిల్లసేవకులచే
గ్రుద్దించుకొను చుండె ♦ గొంతసేపు,

పాటకుల్ పజితేరఁ ♦ బాడించుకొంచును
గొల్పుదీఁచి యుండెఁ ♦ గొంతసేపు,
హితవు మీఱఁగ భాగ ♦ వతుల మేల్వసాల
వింత గన్గొను చుండెఁ ♦ గొంతసేపు,
మద్దెలమ్రోయంగ ♦ గుద్దఁద్రిప్పుచు నాడు
నింతిఁ గన్గొను చుండెఁ ♦ గొంతసేపు,
గీ॥ మంచ మెక్కి యొక్కతెతోడ ♦ మదనకదన
మెంతయును జేయు చుండెను ♦ గొంతసేపు,
తమలము మెసంగి పొగచుట్ట ♦ త్రాగెఁ గొంత
సే, పతం డంత నెం దేఁగె? ♦ జెప్ప రమ్మ॥ 5

క॥ ఏ లంజెయింటి కేఁగెనొ?
యే లీలావతిని బలిమి నెనయించెనొ? తా
నేలాగు మాయ మయ్యెను?
నీ[illegible]ద్రిన్నపుండు కామి ♦ నీలోలుఁ డహో!॥ 6

క॥ వేంకటశాస్త్రిల యజ్ఞము
పొంకము చూడంగ లేచి ♦ పోయెనొ? లే దా
వంకఁ బులిమ్రింగి పోయెనొ?
జంకయ్యెడి జెప్ప రమ్మ ♦ జవ్వనులారా!॥ 7

సీ॥ ఇందుఁ డా వెల్వడి ♦ యెందు వేంచేసెనో
మా సామి జూపరే ♦ మ్రాంకులార!
సన్నకసన్న నే ♦ సకి గూడి యుండెనో
మా జేనిఁ జూపరే ♦ మగ్గులార!
వేఁపుల్క బట్టక ♦ వేఁటకుఁబోయెనో
మా దొరఁ జూపరే ♦ మమగులార!

యుండక భ్రమియించి ♦ యేటికిఁ బోయెనే
మారాజు జూపరే ♦ జారులార!

గీ॥ మమ్ము నేలిన నీలాద్రి ♦ మనుజవిభుఁడు
పూలపాన్పున జెనునిద్ర ♦ పోయిపోయి
లేచి యొక్కరుఁడును మాక ♦ గోచరముగ
నెచ్చట నడంగెఁ జెప్పరే ♦ పక్షులార!॥

క॥ ఎల్లీ! మల్లీ! పల్లీ!
ఫుల్లీ! మా రాజు కూసు ♦ పోవక మీమీ
గొల్లెనక్కై రాఁడు గదా?
కల్లలు వల దింకఁ జెప్ప ♦ గదరే వేగన్॥ 9

సుగంధి॥ నేలఱేఁడులార! మంచి ♦ నేస్తులార! విక్రమా
శీల శూరులార! పిన్న ♦ పెద్దలార! గుప్పునన్
బూలపాన్పు డిగ్గి యేడ ♦ బోయినాఁడొ చూడరే॥
నీలకాశ్యపీ నరుండు ♦ నిన్నరేయి వక్కఁడున్ 10

మ॥ అని గగ్గోలుగ వారు రోదనము సే ♦ యన్, నాయకుల్ గాయకుల్
చనవర్లున్ గణికాజనంబు లనుజుల్ ♦ సామంతులున్ మంత్రులున్
విని శోకాకులచిత్తులై గదిసి త ♦ ద్వృత్తాంత మాలించి, యా
యాస నన్వేషము సేయఁ బోయిరి సమీ ♦ పారణ్యమధ్యంబునన్॥ 11

క॥ గట్టులఁ దరి బుట్టలకడఁ,
జెట్టుల చెంగటను, జెఱువు ♦ చెంతల, బలు పె
న్గట్టుల సందుల గొందుల
బట్టుగ ప్రవహించు నేటి ♦ పల్లములందున్॥ 12

క॥ రోయుచు హాయని కూఁకలు
వేయుచు, హా! నీలభూప! ♦ విస్మయముగ నీ

గీ|| నితర నిజదాసికాజన ♦ నికరములను
బలిమి మైఁ బ్రాపగలింపఁ ♦ బట్టిమిగుల
సమరతులఁ దేలఁ బొడము దో ♦ సమున నొక్కొ..?
నీలనరనాథుఁ డి ట్లంటెఁ ♦ గూలిరాఁడు|| 18

వ|| అని మహోన్మాదావేశంబున నందఱు నిట్లనిరి. 19

సీ|| కొలువు దీర్ప వ దేమి ♦ గురుతరతరుసార
భాసురలక్ష్మీవి ♦ లాసమునను?
కూర్చుండ వది యేమి ♦ ఘుమఘుమామోదగుం
భితసుచందనకాష్ఠ ♦ పీఠమునను?
తేఱి చూడవ దేమి ♦ దృఢతరలావణ్య
గణ్యావణ్యస్త్రీని ♦ కాయములను?
పలుకరింపవ దేమి ♦ బహువేషభాషాతి
బంధురాశ్రితబాల ♦ భాగవతుల?
గీ|| [illegible]! నీలాద్రిరాజ! భో ♦ గానురక్తి
మాని, యీ ఘోరకాంతార ♦ మహిని బండఁ
గారణం బేమి? యేరికై ♦ గాఁక పూని
తెగి యిటకు వచ్చి యిల్లని ♦ ద్రించె దిపుడు?|| 20

క|| కేళీభవనాంతరపరి
కలితమల్లీలతాంత ♦ కేవలశయ్యా
లోలుఁడ వై యుండక యీ
నేలపయిం బడ నేల? ♦ నీలనృపాలా|| 21

సీ|| విజయరామకుమార ♦ విభుఁడు పిల్వఁగఁ బంచె
రాచరాజకుమార! ♦ లేచిరమ్ము
యెఱుకువాఁ డిదె వంది ♦ నేసి మాంసము దెచ్చి
కాచుక యున్నాడు ♦ లేచి రమ్ము

నే యెడ కేగితో? వెన రా
వే యనుచు మోదుకొనుచు ♦ విహ్వలు లగుచున్॥

క॥ మూఁగి యరయంగ, నాతని
తోఁ గూడఁగ జనిన వేఁట తోరపు గుక్కల్
[illegible]గలు సేయుచు సాగఁగ
నా గతి గని చనిరి వార ♦ లందఱు వెంటన్॥ 14

క॥ చని కనిరి చంద్రరేఖా
తనురూపవిలాసవహ్ని ♦ దగ్ధశరీరున్
ఘన చింతాభారున్ నూ
తనజనితదశావికారు ♦ దన్నృపకుమారున్ 15

వ॥ ఇట్లు కనుంగొని సకలపరివారంబు లతనిం జుట్టుకొని యాక్రందనంబు సేయుచు నాశ్చర్యధుర్యమానసంబులతో నిట్లనిరి.

క॥ వాతము పట్టెనొ? వనిఁ బెను
భూతము గొట్టెనొ? మఱెట్టె? ♦ పాము గుట్టెనొ?
హా! తెలియ దేమి మాయయొ
యీతఁడు పడి యున్న చంద ♦ మెంచికనంగన్॥ 17

సీ॥ బహుళద్విజద్రవ్య ♦ భక్షణోద్భవమహా
పాతకంబున నోరు ♦ పడియె నొకొ?
కవిమాన్యహరణ దు ♦ ష్కర్మ ప్రభూతాతి
కలుషంబుచే జిహ్వ ♦ పలుక దొకొ?
పరసతీవ్రతభంగ ♦ కరణ ప్రభవపంక
గతి దుర్బలాంగంబు ♦ గదల దొకొ?
సుజనులఁ జెడఁ జూచు ♦ చూడ్కిఁ జుట్టినకోలఁ
గడుఁగనుంగవ మూఁత ♦ వడియె నొకొ?

వేటకుక్కలగాన్క • వెట్టి పంపిరిదొరల్
చూచివత్తువుగాని • లేచిరమ్మ
కొత్తపారావారు • కొలువంగ వచ్చిరి
రాచయేనుగుగున్న • లేచిదమ్మ
గీ॥ దాసి యొక్కతె నీపొందు • కానచెంది
వాఁచియున్నది విషయింప • లేచిరమ్మ
సలుపు, గొల్పెడి పుండ్లు బూ • చులకు మందు
రాచికొన నీలన్నృప! వేగ • లేచిరమ్మ॥ 22

వ॥ అని మఱియును,

క॥ కదలఁడు పలుకఁడు ధాతువు
పదకరముల నుండఁ జూచి • బ్రతుకునో! లేదో॥
బెదరక జెప్పు మదెల్ల
న్నదో! యీతని కోముదుంబి • వరసాచార్యా॥ 23

తే॥ గీ॥ న నాతండు దగ్గఱ • కరిగి ధాతు
గతి పరీక్షించి, యితనికి గామకొగ
మంకురించిన దికమీఱు • జంకుమాని
సరగ శిశిరోపచారముల్ • సలుప లేచు॥ 24

క॥ అని చెప్పిన వారందఱు
జనితామోదంబుఁ గొండఁ • జల్లని పను వే
పున జేయఁగ సమకట్టరి
మనుజాధిపు చెంతఁ జేరి • మాన్యసమీజన్॥ 25

క॥ పసుపును నూనెయుఁ దరపన
బిసరుహామ్ములఁ గాచి, విసనము • బిండి శిరమునఁ
దిసు మంత గొజ్జిగి వడినిడి,
వెసజెవి మెఱిలి యూదఁ • వేగమె తెలిసెన్॥ 26

ఆ॥ వె॥ తెలిసి యుస్సురనుచు ♦ నలుదిక్కులమజూచి
సైగజేయువారు ♦ సల్లగంజి
వంటకంబు బిసికి ♦ వడిఁబోయ మెల్లన
గుటుకు గుటుకు ననుచు ♦ గ్రోలి సోలి॥ 27

క॥ తెప్పిఱి కూర్చుండి యతం
డప్పుడు తన చందమెల్ల ♦ నాప్తులతోడన్
గుప్పున నేకాంతంబున
జెప్పిన విని, లంజ యెంత ♦ చేసెనటంచున్॥ 28

క॥ బొంకనాసి, గడ్డ సైగయును
నకటా! యీనీలవిభుని ♦ కంటించిన యిం
టికి నొంటికి హానిగదా?
ప్రకటంబుగఁ బురుగు లురలి ♦ పడిచచ్చుగదా॥ 29

క॥ పట్టుడు కట్టుడు కొట్టుడు,
"గట్టిగదల బొడిచేసి ♦ గాడిద మీఁదన్
బెట్టుడు పురి వెడలంగా
గొట్టుడ" నిరి యందరొకట ♦ గోపముమీఱన్॥ 30

వ॥ అప్పుడు నీలాద్రిభూమిపుండు. 31

ఆ॥ వె॥ చానిబట్టబూను ♦ తఱిబీజ గనుగొని
సాని న్నిల్లుసేయు ♦ జనమనాను
కూర్మిమీఱ మీఁదు ♦ కుస్తరించిటతోడి
తెచ్చి కూర్చవలయు ♦ నిశ్చయముగ॥ 32

క॥ తల గొఱిగించుట కంటెన్
మొలగొఱిగించుటయె మేలు ♦ ముగ్ధ యగుటచేన్
సలుపున కోర్వకయుంచిన
చిలవిటులకు నింతభాగ్య ♦ మదీజగతిన్॥ 33

క॥ సమమై, రోమరహితమై,
యమితమృదుత్వంబుఁ గలిగి ♦ యశ్వత్థదళో
పమమై, స్నిగ్ధంబై వెలు
పమరెడు భగమిచ్చు భాగ్య ♦ మందురు సాముద్రికుల్॥ 34

ఆ॥ వె॥ ఇన్నిలక్షణంబు ♦ లెన్నదానిత్రికోణ
పాళి నుండుననుచు ♦ హాళినాదు
నంతరాత్మ దోచ ♦ నయ్యెదె సౌభాగ్య
వతియె యిమ్మ పెక్కు ♦ వాక్కు లేల॥ 35

ఆ॥ వె॥ దాని యోనితీరు ♦ దానిచన్నుల చెన్ను
దాని మోము గోము ♦ దానిమోవి
కావి తీవి చెప్ప ♦ గా మాకు శక్యమే?
రోమములు వడంకు ♦ భీమరాజ॥ 36

క॥ సిద్ధాంతివి పండితుడవు
సద్ధర్ముండవును నాకు ♦ సఖుడ వెపుడు నే
నుదతి దానిరమించెద?
దగతిం జెప్పు శాంతి ♦ సుబ్బయమార్కుఁడ॥ 37

వ॥ అని పలుకునప్పుడు, పండితుడును నిష్ఠాగరిష్ఠుండును సుజ్ఞాననిష్ఠుండును హితుండును బ్రాహ్మణాగ్రగణ్యుడును శాంతుండును సకలజనసమ్మతుండును జతురుండును బ్రయాగవంశోత్తంసుడును నగు బాపన్న యాపన్నుండై యాపగిది వాపోవుచుఁ గన్నులు తేలవైచుచున్న యా నీలాద్రి మన్నుతేనిం గనుంగొని వినయవిస్రంభగాంభీర్యంబులు గుభింప గంభీరభాషణంబుల మెల్ల మెల్లన యిట్లనియె.

క॥ పరనారీ సోదరుడవు
పరతత్త్వవిశారదుఁడవు ♦ బహురాజసభాం
తరనుతకీర్తివి వేశ్యా
తరుణీమైథునము సేయఁ ♦ దలపం దగునే? 39

సీ॥ చెఱువు చేసితివిగా ♦ చెలగ బాడవక్రింద
సదాశ్రిజ లెన్న స ♦ ముద్రముగను
వనము నిల్పితివిగా ♦ వర్ణింపరాకుండ
వీఁక నరట్ల కు ♦ ప్పాకనడుమ
మాన్యమిచ్చితివిగా ♦ మహిమిమూలంబున
శొంఠి సుబ్బయ్యకు ♦ క్షుద్రభూమి
నాకిచ్చితివిగదా ♦ నాలుగై దువరాలు
పేశలగతిని వ ♦ ర్ధాశనముగ
గీ॥ వివిధసంగ్రామజయరామ ♦ విజయరామ
రాజకరుణాకటాక్షుని ♦ ర్వ్యాజలబ్ధ
సకలసామ్రాజ్యఖనివి నీ ♦ వకట! యొక్క-
పుప్పిణోగపులంజె కై ♦ పొగుల దగునె?॥ 40

క॥ ఇల్లును నొల్లును గుల్లగు
బెల్లలరేడు రాజ్యలక్ష్మి ♦ పెంపుహరించున్
గుల్లాపు సానిదానిన్
మళ్ళనితమి గోరినీవు ♦ మఱిరతి సలుపన్॥ 41
క॥ వద్దుసుమీ యిది కూడని
పద్దుసుమీ నాదుమాట ♦ పాలించితివా
ముద్దుసుమీ యాసానిది
నొద్దుసుమీ దాని డెంగు ♦ మోహంబేలా॥ 42
క॥ జగ్గకవిరాజు చేతం
బగ్గయు సిరె తోవ దిల్లు ♦ వడితివి చంద్రిక్
మగ్గము వెట్టిన మొదలే
నెగ్గవయో! నీలభూప! ♦ నృపసుమచాపా॥ 43

వ॥ అప్పు డప్పలుకులు విని కటకటం బడి కటము దరం బండ్లు పెటపెటం గొఱికి చటులక్రోధకుటిలారుణాలోచనుం డై తదీయపరిహాస పరిధానుం డగు నాసురి భీమనామమంత్రి యోసరి కిట్లనియె.

క॥ పరిభవచిత్త మివ్విధంబున
బరిభవించునొ యక్కట నీవు ♦ బలుకకె నడి ని
ర్లభయము మాని పలికెదవు
సభలో వారెల్ల గడున ♦ సహ్యత పడగన్॥ 45

క॥ ఓంబూలు చేసికొనుచును
జంభంబులు గొట్టుకొంచు ♦ జడమతి నశుభా
రంభము లరయుచు దిరిగెడి
దంభపు విప్రునకు నీకు ? దగదిది చనుమా॥ 46

ఆ॥ వె॥ పప్పుదప్పళంబు ♦ లొప్ప దప్పొప్పులు
సెప్పుకొంచు దడక ♦ విప్పుకొంచు
జదువుకొంచు దిరుగు ♦ ఛాందసుల్ మీగాలు
రాచకార్యములకు ♦ రాఁగదగునె?॥ 47

క॥ కైశ్యంబేలా విధవకు?
వైశ్యునకున్ సమరజవిజయ ♦ వాంఛల వేలా?
వశ్యయుయికులకి పైబడు
వేశ్యారతి సుఖము వేద ♦ వేద్యున కేలా!

వ॥ అనిన నమ్మంత్రిజనపుంగవున కాతం డిట్లనియె. 49

క॥ నిష్ఠాహీనుండవు ఘన
నిష్ఠురమాయాప్రలాప ♦ నిపుణుడ నీవే
జేష్ఠవితని నియోగి
శ్రేష్ఠులలోపలను జేర్చి ♦ చెప్పగనేలా? 50

క॥ తిరుమణిఁ దులసిపేరులు
తిరువారాధనయు బెద్ద ♦ తిరుగూడ నెనస్
ధరియించి ముష్టి కిప్పుడె
తిరిపెము మంత్రాంగముడిగి ♦ దాసరి వగుచున్॥ 51

గీ॥ బాధ్యుడను బండితుడు గూరకపాటిరాయ
మంత్రివర్యుం డతని దోలు ♦ మడత వెట్టి
కొట్టి సన్యాసి జేసితి ♦ నిట్టివాడ
విగని గులశేఖరునిఁ జేయు ♦ టెంతనీకు॥ 52

సీ॥ ఇయ్య నీయప్పగదా ♦ యెంతొసత్కవి వచ్చి
ప్రసుతించినఁ బూట ♦ బట్టెమున,
నుండ నీయప్పగదా ♦ చండపండితరాజ
మండలంబును సభా ♦ మంటపమున
నిల్వ నీయప్పగదా ♦ నిమిషమాత్రంబైన
నాశీర్వదించు ధ ♦ రామరులను
చూడ నీయప్పగదా వేడుకతో బాడు
గానవిద్యాప్రౌఢ ♦ గాయకులను
గీ॥ కూసుమతమూరరతుడవై ♦ కులమువిడిచి
తిరుగు నీవిందుజేరి మం ♦ త్రిత్వమూని
త్రిప్ప, నీలాద్రిరాజిట్లు ♦ మెప్పె యయ్యొ,
భీకరవ్యాజ! యాదూరి ♦ భీమరాజ॥ 53

శా॥ సామంబేమియులేదు, సాంత్వనవచ ♦ స్సందర్భముఁ నాస్తి దు
ర్నామత్వంబదికంబు, కాముకతయు ♦ స్థాపల్యము స్వేచ్ఛగా,
భీమామాత్యుడవంచు బల్కుదురు నిన్ పృథ్విన్ యథార్థంబహో
నీమంత్రాంగముచేత నేడు చెడియెన్ ♦ నీలాద్రిరాజెంతయున్॥ 54

క॥ గణికశ్రేష్ఠుఁడ వయ్యా!
గణికాంగన పొందు రాజు ♦ గారికి దగ దం
చణుమాత్రము జెప్పవు, నీ
గుణము తెలిసివచ్చె, బుద్ధి ♦ కుశలుఁడవు భళీ॥ 55

క॥ అని వా రిరువురు నిటువలె
ఘనఘన రవసదృశనాద ♦ గద్గదగళు లై
కినుక వివాదింపంగా
విని చింతలపాటి నీల ♦ విభు డిట్లనియెన్॥ 56

క॥ మీ రేటికి వాదించెద?
రూరక యుండుడు, చెలిమి ♦ యొప్పారంగ
గౌరవమున నా మది గల
యారాటము దీర్ప బాపఁ ♦ డసమర్థుఁడు గా?॥ 57

క॥ రతిచింత చేత నిప్పుడు
మతిపోయిన రీతి నుండు ♦ మాకున్ సుస్థుల్
హితమతిఁ జెప్పెదు, ఓహో!
పతిచిత్త మెఱుంగలేవు ♦ బాపడ వయ్యున్॥ 58

వ॥ అని యతనిమీఁద రోషసంఘటిత చిత్తుండగుటఁ గనుంగొని
తత్సన్నిధి గల వార లేగుమనిన నతం డరిగె. నంత భీమరాజుం జూచి
యేకాంతంబున నిట్లనియె. 59

క॥ బాపఁడని నేస్తుఁ డనియును
నోపిక జేసితిని గాని ♦ యొడుతును జామీన్
పాపమున కోడ కీ మ్మెయి
బాపన్నను భీమరాజ ♦ పట్టు కోపమునన్॥ 60

వ॥ అనిన భీమరాజతని కిట్లనియె. 61

క॥ అద్దమ్మైన బంది బోడవవా?
యెదురించు పులిని బోడవవా ♦ యేన్గుఁ బోడవలో

కదనమున శత్రుల బొడవవా
వదరుచు నెదురాడు నట్టి ♦ పారు బొడవవా॥ 62

క॥ అని భీమరాజు పలికిన
విని మనమున సంతసించి ♦ వేడుకతో ని
ట్లనియెను జంద్రిని వేగం
బలకూలము సేయు కున్న ♦ హా! మెట్లో ర్తు॥ 63

ఉ॥ కోకిలకీర శారికల ♦ కూకలకన్ గలహంస కేకినీ
నికరసిర్భరార్భటికి ♦ బెగ్గిలితిన్, మఱి చెప్ప నోప, నెం
దాక సహించువాఁడ, వెన ♦ దాని త్రికోణము దెచ్చిచూపుమా
నా కదలోని మన్మథక ♦ నన్నన పావక తాప మాఱగన్॥ 64

గీ॥ మఱి విచారింప నది యూడి ♦ మళ్ళ వేంక
టాభిధాన ప్రజాపతి ♦ యంశఁ బుట్టి,
సకల రతిబంధచాతుర్య ♦ సరణి గనియె
పూని వర్ణింప దాలి కే ♦ సాని నవతు? ॥ 65

క॥ కావున వేంకటశాస్త్రికి
నాగల పెఱుగంగ జెప్పి ♦ ననుం నాతఁడు తా
నావలి పని సమకూర్చును
వేవేగమె భీమరాజ! ♦ విచ్చేయు సయూ॥ 66

వ॥ అని చెప్పి.

చ॥ పనిచిన నాతఁ డేఁగి కనె ♦ భంజితసీల రాజశాయసం
జనితకరోటికూటము వ ♦ సానఘృతశష్పశసత్పలాశమాం
సనికరవర్ధమానవిల ♦ సత్స్ఫుటువహ్నిశిఖావళీభాట మ
త్యనుపమమంత్రతంత్రకర ♦ యాజకఘోటము యజ్ఞవాటమున్॥ 67

క॥ కనుగొని తచ్ఛాలాంతర
మున దక్షుడు బోలె యజ్ఞ ♦ మూర్ గ్రమంబుఁ దా

ధూర్తపండితపామరజన సమూహంబును, బ్రాహ్మణార్థసంపాదితబహు
ళసత్ఫలశాకపాక భక్ష్యభోజ్యదధిఘృతగుడాదిక వస్తుస్తోమచౌర్యక్రియా
కౌశలయాతాయాతాయుతతాయి శ్రేష్ఠకుమారనారాయణశాస్త్రివిశ్రుతం
బును, సంభావనాసంభ్రమాలోకనాస్థసమాగతవితతవారాంగనాభుజంగ
పుంగవ శృంగారకేళీగృహాయమానశాలాసమీపప్రదీప్తవిశాలకాయమా
నినికాయంబును, విపులాపూపశతాపూపమూవపీవోపస్థాస్థలవిస్తీర్ణాస్తోకానేక
దీర్ఘతరశ్యామలకోమలరోమస్తోమోద్ఘాటనపాటవప్రోల్లసద్వ్యాలవిధవావిరా
జితాంతర్గేహంబును, విదార్యమాణపశువిసరకళేబరసంజనిత ఘనతరక్షరిత
క్షతజ ప్రవాహాబింనసందోహాగ్రసనవ్యసనసంభ్రమభ్రమదదభ్రశుభ్రగృ
ధ్రకాకఘూకకంకకౌలేయక గవయగోమాయుప్రముఖవన్యఖగమృగజాల
కోలాహలబధిరీకృతజనసమూహంబును, పరను నిర్భరనిర్భాగ్యదామోద
రదురోదరమృగయావినోదామోదఖేలనిశ్శీలాద్రి నృపాలబాలిశదుష్కర
కరాగ్రసమర్పితసూకఫలదానధారాపూరంబును గా క్రతువు సమా
ప్తంబుగావించి, "జన్నంబు బన్నంబు లేకుండం గడతేఱె; మ
దీయపుత్రియు నిజముఖకళావిలాసతిరస్కృత చంద్రరేఖయగు చంద్రరేఖ
యను కోమలాలంకారభవ్యయగు నా కావ్యకన్యకను నుత్తముండగు
నీలాద్రినృపుండు వరుండయ్యెడు సమయంబు నయ్యె. మానుకీనభాగ్య
మహిమంబు చెప్పఁదరంబె?" యని సంతుష్టాంతరంగుండై చనిచని॥ 73

సీ॥ పూతిగంధాధార ♦ పుంఖిత డిండీర
భగితమై రేయునం ♦ భ్రవజంబు.
గ్రామసూకరమాంస ♦ ఖండతోరణవారి
కంకవాయస గృధ్ర ♦ సంకులంబు
మేదినీఖాదనా ♦ మోదసలిపావిత
తామ్రమూషాసహ్యా ♦ తటశిలంబు

రతిరాజసంగరో ♦ త్థితసిద్ధజనశుక్ల
మూత్రార్థ్రగేహాళీ ♦ చిత్రితిండు

గీ॥ విటవిటీజనసంధాన ♦ విహితవచన
నిచయరచనానిపుణకుట్ట ♦ నీపహాయ
కరణకారణకౌలేయ ♦ కంబు; వేంక
టాభిధానాతినీచవే ♦ శ్యాలయంబు॥ 73

క॥ ఇటు నటుఁ గనుగొని లోనికి
నొటనొటఁ జని మాచ మెక్కి ♦ లోలతనది తి
న్నటమునఁ గూర్చుండిన, వ
న్నుటిలాత్మ్మము కౌగలించు ♦ కొనియుల్లనిమెఁ॥ 74

తే॥ గీ॥ ఎంతభాగ్యంబు చేసితి ♦ మితపురమును
కాను విడకుండ యజ్ఞంబు ♦ కలిగెఁ జంద్రి
రేఖను దలంచి నీలాద్రి ♦ జేడు మిగుల
మోహితుం డయ్యె భాగ్యమా ♦ మోద మొదవె॥ 75

క॥ నీలాద్రిరాజు నిక్కిలి
తాళక కృపమియుంచె విరహ ♦ దహనముచే. నీ
వేళం జచ్చును వేగం
బాలోలత జంద్రినంపు ♦ మాతని కడకుఁ॥ 76

తే॥ గీ॥ ప్రాలమాకులు నీవు నీ ♦ తెత్తికయును
మాచు వల్లవెలింగి బో ♦ జగుల వలపు
వెల్లిగొలుపుచు బలువుగ ♦ విత్త మెల్ల
లాగుదురు, ధాత్రిమీవంటి ♦ లంజెలేఁ? 77

తే॥ గీ॥ నేఁడు నీకల్లు డాయెను ♦ నీలసృపుడు
కూఁతురునునీవు నేనును ♦ గొదవలేని
సిరుల బొదలెద మింక నీ ♦ చిన్నదానిఁ
గడకగై సేయు మని చంద్రి ♦ గాంచి పలికె॥ 78

తే॥ గీ॥ బాలరో! నీవు మిగుల సౌ ♦ భాగ్యవతివి
యొక బోజగు నోవ మతియొక్క ♦ డుత్తముండు
దొరకె నీలాద్రిరాజు స ♦ చ్చరితు డిపుడు
నిన్ను గోరి పిలువనంపె ♦ నేడునీవు॥ 79

క॥ ఏలాగున నలయించెదొ?
యేలాగున నీలవిభుని ♦ వలయించెదొ? మ
స్మేలాగున రక్షించెదొ
బోవే జెగటు నీదు భగము ♦ పుణ్యము చేత॥ 80

వ॥ అనిన జంద్రరేఖయిట్లనియె. 81

సీ॥ చూపుకోపులచేత ♦ జుంబనంబులచేత
దంతక్షత నఖక్ష ♦ తములచేత
తాడనంబులచేత ♦ బీడనంబులచేత
గాఢపరీరంభ ♦ కలనచేత
నుపరతి గతులచే ♦ గపటవాక్యములచే
దాంబూల దానవి ♦ ధంబుచేత
కలపంపు,బూతచే ♦ గారవింపులచేత
గాన నాట్య ప్రసం ♦ గములచేత

గీ॥ మందు మంత్రంబులను నీల ♦ మనుజవరుని
లోలు గావించి కలధనం ♦ బోలిలాగి
పిదప జోగిగ గావించి ♦ పెంపుడించి
తెత్తు మానస్వి ధీక్షనా ప్ర ♦ తిజ్ఞ వినుడు॥ 82

ఆ॥ వె॥ దొడ్డదొడ్డ తురక ♦ బిడ్డలనాతోడ
లందు నిరకబట్టి ♦ యడుగునెత్తి
కొట్టి లోల్లు జేసి ♦ వెట్టివానిగజేతు
నీలనృపుడు నాకు ♦ జాలగలడె॥ 83

తే॥ గీ॥ అనిన, నీ వంత నేర్పరి ♦ నగుదు వమ్మ!
లెమ్మ! ముస్తీబుగమ్మ, శ్రీ ♦ ఘుమ్మగాను
బొమ్మ ఋతునిశమిఁ దీర్పఁ ♦ గమ్మనిట్టు
చేతిబాగరుబొమ్మ! మోహ ♦ చిన్నకొమ్మ॥ 85

క॥ నావు డల చంద్రి యప్పుడు
భావం బలరార లేచి ♦ పరిపరిగతులన్
వేనేగ జేయ దొడగెన్
గేవలశృంగార మెబడలఁ ♦ గెలుకొసంగెన్॥

క॥ నీలాద్రిరాజు మోహమున
గ్రాలెదు గజంబు రీతిఁ ♦ గనుపట్టె మహా
స్థూలోపస్థాభాసా
శీలతనూరుహాళులు లస్సి ♦ బిరబిర బెణికెన్॥ 86

క॥ ఆతని పెనుబాలీసుల
భాతిన్ గడుపొడవు లగుచు ♦ బ్రబలుకుచము లా
దాతలమల యాచలసం
జాతసుగంధంబు మిగుల ♦ జానుగ నలరెన్॥ 87

క॥ భుగభుగ సుగంధబంధుర
మగు చుండెడు దూవ మిడిరె ♦ నానందముగన్
నిగనిగ లీనెడు తన భువ
భగదేవత కాత్మవాంఛ ♦ ఫలియించుటకున్॥ 88

ఆ॥ వె॥ గొట్టెబొచ్చుకంబె ♦ నెట్టి నై చిట్టి లో
నుట్టివెంద్రుకలను ♦ గూడనువ్వి
తొట్టికొప్పు వెట్టె ♦ నట్టుమీదను జాల

క॥ హరిమొగము జెగడు మొగమున
హరిదళమును దళముగాఁగ ♦ నలది మహాసిం
ధురతరనేత్రయుగంబునఁ
గర మరుదారంగ మందు ♦ కాటుక వెట్టెన్॥ 90

క॥ సతికి సింగారించిన
యిత్తడి సొమ్ములను బోలి ♦ యెసఁగఁగ మేనన్
బుత్తడిసొమ్ములు తన కా
పత్తారణ కారణముగ ♦ బాగుగ దాల్చెన్॥ 91

క॥ కంచెలలోపల గట్టి బి
గించెన్ జనగట్టుదోయి ♦ గిరినాగుల నా
డించక హి తుండికుఁడు వడి
వంచనతో బెట్టినట్టి ♦ వైఖరి దోపన్॥ 92

క॥ ఈ లీల నలంకృత యై
యా లోల వెలింగె ♦ నప్పుడాశ్చర్యముగా
నీలాద్రిరాజు బట్టం
బో లోలత మెఱయు పెద్ద ♦ భూతమొ యనగన్॥ 93

ఉ॥ అప్పుడు సోమయాజులు త ♦ దాకృతి వేంకటసాని యుక్తమై
యొప్పులు మోడ్చు కర్మిలి నె ♦ ఱేఁగని కూతుర! నీకు దుల్యయా
నొప్పులకుప్ప నిప్పుడమి ♦ నొక్కెడ జూడము, లోల వయ్యు బా
గొప్పెదు బాలలీలగడు ♦ నూనితి మే ల్భళి! యంచు మెచ్చెగన్

క॥ నీలాద్రిరాజు వార
స్త్రీలోలుండయ్యె నింక ♦ జెడి వైతరణిన్
గూలు నిటు లనుచు దెల్పెడి
పోలిక నంభోధి గ్రుంకె ♦ బ్రొద్దు ఱయమునన్॥ 95

క॥ అపకారి నీలభూపతి
యపయశ మల నిష్టపముల ♦ నలమె ననంగా
విపుల మగు కటికిచీకటి
విపులాస్థలి నంబరమున ♦ విప్పుగఁ గప్పెన్॥ 96

క॥ సచ్చోడాకీ పచుపీతడు
మెచ్చమునకు సచ్చమునకు ♦ యిచ్చలయిడిగా
యిచ్చిను హెచ్చుగ గొలువుము
సచ్చి యిటుల సేరబోక ♦ సందరలేకా॥ 121

క॥ దేవేరిం గేరెదవు స
ద్భావంబున నితడు చేత ♦ బట్టిన నీ, వో
ప్రావుంబోడిరో। విటసం
భావన పై దలపు విడిచి ♦ బత్తి గొలువుమా॥ 122

సీ॥ పాటపాడు మటన్న ♦ బాడకమెలుగెత్తి
పదరి రోదనము చే ♦ సెదవుసుమ్మ
కాళ్లొత్తుమనివేడ ♦ గడువడినొత్తక
నెఱరొత్త మని పలి ♦ కెదవు సుమ్మ,
తముల మందిమ్మన్న ♦ దమినీక క్రమ్మఱ
నాం కిమ్మటంచు బె ♦ నగెదు సుమ్మ,
రతికి రమ్మని పిల్వ ♦ రాగిల్లిడాయక
యదనున గడకు ♦ బోయెదవుసుమ్మ

ఆ॥ వె॥ తురకదుండిగాడు ♦ దూదేకులియు గాడు
పసులవాడుగాడు ♦ బట్టుగాడు
మనల నేలునట్టి ♦ మనుజనాథుడితండు
సెప్పినట్లు నీవు ♦ సేయు చంద్రి॥ 123

వ॥ నావుడు నతం డిట్లనియె. 124

ఉ॥ పుత్తడికీలుబొమ్మ యన ♦ బోలెడు బోలెడు యోని చందిరీ
హత్తగ నోడితెచ్చి విర ♦ హార్తి హరింపగజేసినావు నీ
కుత్తమభూషణాంబరస ♦ ముత్కరమిచ్చెద వేగనందు మో
యత్త। వలగ్న నిర్జితవి ♦ యత్తల! వేంకటసాని జానుగన్॥ 125

క॥ అన నవ్వుచు వారిద్దరు
జని రంతట నీలవిభుడు జంద్రినిగని నూ

తన మదనకేళి దేలెద
నని లోపల మోహ మొదవి ♦ హస్తము పట్టన్॥ 126
క॥ తల వంచి పట్టెకంకటి
గల దండము పట్టి వదల ♦ గా నొల్లక తా
వెలవెలఁ బోవుచు సిగ్గం
గల బాలిక నోరె బెనఁగ ♦ గా నాతండున్॥
ఉ॥ ముంగటికుచ్చు పట్టఁగొని ♦ మోహమునన్ దన శయ్యఁ జేర్చి వా
కొంగన వింత సిగ్గువడ ♦ నగ్గమె? యిందరజక్క బొట్టితో
దొంగతనంపు టీ వగలు ♦ ద్రోచి హసన్ముఖి నయ్యఁ గౌగిటన్
లొంగఁగ బట్టి నన్ను రతి ♦ లోలుని జేయుము నీకు మ్రొక్కెదన్॥
ఉ॥ చంద్రుఁడు మింట నంటి సర ♦ సంబుగ నగ్నికరాళివిస్ఫుర
చ్చంద్రికఁగాయఁజొచ్చె సుమ ♦ చాపుడు బాణము వేయఁజొచ్చెనో
చంద్రి! విలాసవిభ్రమ వి ♦ శాలకళారసలీల మీఱఁగా
సాంద్రకృపాకటాక్షమున ♦ జక్కఁగ గన్గొని కోర్కె దీర్చుమా॥
సీ॥ సకల భాగ్యము లిచ్చు ♦ చక్కెర కెమ్మోవి
చవులు చూపింపవే ♦ చంద్రరేఖ!
శంబరాంతకుచేతి ♦ శరముల కోర్వను
జక్కఁ గౌగిట దాఁచు ♦ చంద్రరేఖ!
చల మేల పూనెదు? ♦ వరపు నిల్వగ జాల
జన్ను లంటగ నిమ్ము ♦ చంద్రరేఖ!
తాళ జాలను నీదు ♦ కాలికి మ్రొక్కెద
స్మరమందిరము జూపు ♦ చంద్రరేఖ!
గీ॥ కడకు బోవక నెమ్మోము ♦ ముడుఁచుకొనక
సిగ్గు విడనాడి నను గటా ♦ క్షించి నీదు
కన్నె పాయంపు రతికేళి ♦ గలియ నిమ్ము
జాగుచేయక కటకటా ♦ చంద్రరేఖ॥ 130
క॥ నీకున్ దాస్యము చేసెద,
నాకున్ గల ధన మొసంగి ♦ నానాగతులన్

జైకొని రతిన న న్నేలుము
బ్రాకటముగ జంద్రసాని! పల్లవపాణీ॥ 131

చ॥ సిగ విడి జాఱ, మోముపయి జెమ్మటబిందువు లూర, గబ్బి చ
న్నొగడలు నిక్కి డేఱి దిగి ముత్తెపుపేరులు శయ్య జేరఁగా,
భగ మతిసార మూర, జల పంకకళంకత జీలువారఁ గా
వగఁ బురుపాయితంబున న విశ్యము నేలుము చంద్రశేఖరో!

క॥ నా విని శశాంకవసన్న భ
కేవలసుస్మిగ్ధమదన గృహము చెమర్పం
గా వాలు కెళుకు జూపుల
దా వలనుగ నతని మోము తప్పక చూచెన్॥ 133

క॥ ఇటు నతఁ జూచిన నాతఁడు
గటువుకున నిదె సమయ మనుచు దమి దీరఁగ గాఁ
గిట నొత్తి మోవి మధు వటు
గుటుకు గుటుకు రనుచు గడుపు గొలదిగ గ్రోలెన్॥

సీ॥ బుడికిండలవంటి బుగ్గలు చుంబించి,
గొజ్జబొంచ్చును గేరు కురులు నిమిరి,
కిప్పచిప్పలవంటి కన్నులు ముద్దాడి,
యూదబొడ్డున కరం బూది నిలిపి,
కొలిమితిత్తుల బోలు కుచములు పీడించి,
మరిగాళ్ళ దెగడెడు కరములంటి,
కొంగకంఠముఁబంటి కుతుక గోరులనించి,
పులిబోనుబోలెడి వెట్టినట్లు

గీ॥ వెడద కుంచెపులో బ్రేలు వెట్టినట్లు
యోనిలో గామదండము నొత్తి గూర్చి
వెనుకకును ముంగిలికి నూఁగి కొనుచు నీల
ధారుణీశుండు వడివడి దాఁక నదియు॥ 135

క॥ మును నల్లమందు మాజుము
తిని యున్నది గాన మేను తిమ్మిరిగొని యా

తని తాకులకు జలింపక
తన నేరుపుకోపు జూప ♦ దలచి కడంకన్॥ 136

క॥ భగము విగసింపజేయుచు
బిగబట్టుచు లోన జొర న ♦ భేద్యంబుగ ద
ప్పగ ద్రోయుచు బెణకించుచు
బిగి తొడలం జుట్టి పట్టి ♦ బిట్టలరించెన్ 137

సీ॥ పారదోపమ వీర్య ♦ ధారాతత భగంబు
స్తనచర్మ భస్త్రికా ♦ తాండవంబు
కక్షప్రదేశ ని ♦ ర్గతఘర్మ సలిలంబు
చక్రక్రమచపేట ♦ చాలనంబు
భూరితరాపాన ♦ మారుతోద్ఘాతంబు
ఘనదేహ దుర్గంధ ♦ గంధిలంబు
శునకబంధవిశేష ♦ వినమితమేఢ్రంబు
క్రీడారచితపాద ♦ తాడనంబు

గీ॥ గాఢభస్త్రికనిస్సర ♦ గ్రామ్యవచన
మమితరోదన జలపూరి ♦ తాననంబు
చంద్రరేఖాభిధానవే ♦ శ్యాలాస్య
ప్రథమసురతంబు నీలభూ ♦ పతిగరంచె 138

వ॥ ఇవ్విధంబున సమరతి గావించి నప్పుడప్పుడు పుంభోటిమిన్న మున్నెరికంబున నన్నీలాద్రి రాజపుంగవు పైబంభించి హుంకరించి జంకించుచుఁ యులేక సంకోచంబు మాని 'ఇంక నాచేతం జిక్కితి, వెక్కడికి, బోయెదవు? ; నిలునిలు, నాయుపరతి చమత్కారంబు తోరంబుగాఁ జూపెద బరాకుగాకు రాకొమరా! మాటాడక నాకేమి మెప్పు లిప్పుడిచ్చెదవో మది నెంచుకొమ్ము' అని చెక్కిలినొక్కి యుక్కునం గ్రక్కునం దన లంబమాన పీనస్తనంబులు గదియించి నునునొడల గుదియించి వదలని మదంబున ముదంబునజంన మదనసదనంబున నతనిమేహనంబును

నమోఘంబుగా దగిలించుకొని ముమ్మరమ్ముగా దొమ్మరికొమ్మ గడ గడసియాడు చందంబున సంభ్రమించుచులాగి త్రైచుచందంబున నొత్తుచు మేను మేనహత్తించుచుఁ దత్తిరింపకిఁ గొంచెపడక దిట్టతనంబు జెచ్చుకొనివిచ్చలవిడి ముచ్చట తెల్లం దీర జనుగుబ్బల గట్టిగ బిగబట్టి యిట్టట్టు బెనంగకఁ దడంబడక గుట్టుచెడకఁ జేతులు పట్టువిడక నెదురు దట్టింపుమని చేయి మార్పు మార్పుమని, మడుగు తప్పెనని మించ బలుకుచు గులుకుచు గోడెపాయంపు నాడెంపు సాలెవాడు ఘుళుకు ఘుళుకు మన బలక చులుకగ దాటించు నాటంబున నోటువడక నీటు జూపుచు, బరిభ్రమణవేగంబునంగరపాదభూషణ విశేషంబులుఘుల్లుఘుల్లు మని భీషణంబుగ ఘోషింప నవ్వారయోషాలలామంబు పెదవి పెదవిం గదియ దన నిడుదవాడి మొనపంటంబట్టి పీల్చుచు చిట్టిమట్టి వెండ్రుకల తొట్టికొప్పు వీడి యక్కటి ప్రదేశంబున నటియింప కుండలంబులు గండ తలంబునం దాండవింపఁ గోరిదకంప సొంపునం బెంపారు కంపుమేనుల ననూనంబుగా గ్రమ్ముముమ్మరంపు జెమ్మటసోన లతని మర్ధరతర సం వృథమానదేహాశాల్మలీ ద్రుమంబునందు దిక్కజాల నీరులసివం బెట్టిన లాగున నూగులాడు చుండంగని యా ప్రజాపతి నేద దీర్చుకొని క్రమ్మరి నమ్మరుదుఃఖంబున కెదిరించి వలదని చలమ్ము హెచ్చఁ బెచ్చు పెరుగు మచ్చరంబున నమదమ్ముగ నదుముకొనిన నదియు నదలక పదరుచు గుదిగొన్న తమకంబునం దలంకక నెదురుదాక ఢాక నిద్దఱుం దద్దయు సంభ్రమంబును జలంబును జయకాంక్షయు బెనంగొన నగ్గలంబుగ నిగ్గుచు వెనుకకుం దగ్గుచు మొగ్గరించుచు బగ్గలు సెప్పుకొనుచుఁ జెండు చెండుగ బండబండగ దాకులాడు నెడ నచ్చంద్రరేఖ విహారవిటజన సం యోగజనిత చాతుర్య కళాధుర్య కావున మొగ్గవేసి మోటునడంజేయు నమకట్టిన నాదిట్టమట్టిచేడును బహుగణికా విలాసినీదాసికా సంభోగ

సంభృతన్నైపుణీగుణగణగణ్యుఁడు గావున వెనుదీయక నును దొడలం దాని నడుము బిగించి మూఁ జొడ్డుచుఁ దెబుకు దెబుకు మను చప్పుడు లుప్పతిల్ల బిట్టుబ్బుచేతల నొట్టుకొని గుట్టువదలక పట్టువట్టి సూటిఁ దప్పకుం డగంటుమిరారిమూర్కొన్న మహిషంబులడంబున జిత్తకుక్కల విధంబునఁ చీంబోతులభాతి; మాలమాసటీంబ్లం జోతె, మూర్ఖాలంబుల కై వడి మనకంపు బెనుబాముల చందంబునఁ మదించిన కోడిపుంజులమాడ్కిఁ లకుముకల లాగున, గొత్తిపోతుల్ళభాతి, గుంటుక దోలు లీల కొర్త వేసిన కై వడి చిట్టాముదముల గ్రుమ్ము నేర్పున గొంకు జంకులేక, సమరతి; యువరతి బంధంబులం దేల జిలజిల మరుజలంబులు జాలుకొని తదీయశేమ్యాతలంబునం బడి వెల్లి విరిసి సెలయేరులై పాఱ మహోన్మేధునసంకల్పసంభోగ క్రీడా వినోదంబులు పూని యొప్పి పొంచి తొడల తొడలును, బాహువుల బాహువులును, మోవిని మోవియు, మొగంబున మొగంబును, పదంబుల పదంబులును, నురంబున నురంబును భగంబుల లింగంబును, గదియ గౌఁగలించుకొని దీర్ఘనిద్రా సమాయుక్తనేత్రులై పడియుండి రనంతరంబున. 139

క॥ తమ్ములు జక్రమ్ముల నథి
కమ్ముగ బాదించు రాజు ♦ కాంతి దొరగి వే
గమ్మున గ్రుంకెఁ దదితి
గ్రుమ్మరు నీలాద్రి రాజు ♦ గ్రుంకక యున్నె॥ 140

క॥ అలనీలాద్రిమహీపుం
డెలమిని జంద్రుని గమించు ♦ యెంతయు దేజో
బలహీనుడగుచు దేలుపఁ
దెలుపు వోడమి నట్టు తూర్పు ♦ తెలతెలవారెన్॥ 141

క॥ ఇనవంశ సంభవుండే
ఘనసామ్రాజ్యంబు నొరగి ♦ కాముకు డౌ నీ

లన్నృపతిఁ గాదన నీ కకఁ
జను చెంచెదనంగ నపుడు ♦ సనిర్భృతమ వోఁచెఁ॥ 142

తే॥ గీ॥ ఇంతి యింతలపాటి ♦ నీల్మాద్రి రాజు
మొగము వెల వెల బోవంగ ♦ నగుచు లేచె
చంద్ర రేఖయు ముఖకాంతి ♦ సడలి కనుల
నసుమకోంచుచు మేల్కాంచి ♦ మనలు నుండె॥ 143

వ॥ అత్తఱి నా రాజోత్తముండు నాంచ కూర్చి యిట్లనియె.

కం॥ నావంటి రసికు డెందముఁ
కేవలముగ గరగ జేసి ♦ కేరుచు మిగులన్
భావభవ కేళి దాసుని
గావించితి నీకసాటి ♦ గారే సాటుల్॥ 145

కం॥ నీ మొగము నీ త్రికోణము
నీ నెఱుగుం గన్నుదోయి ♦ నీ నునువోడలున్
నీ మోవి నీ కుచంబులు
నా మది నిక మఱవజాల ♦ నమ్ముము బాలా! 146

కం॥ సొమ్ములు చీరలు వరాల్
సమ్మతమున నీక నిత్తు ♦ సత్యం బిక నా
సొమ్మలయి యుండుము విటనం
ఘుమ్ములతో జెలిమిమాని ♦ కలికి! యెపుడున్॥ 147

ఆ॥ వె॥ సాని దాన సంటు ♦ బూని లోలోనెచ్చు
కాంద్ర గూడనేను ♦ గాంచినపుడె
చన్ను ముకు లోని ♦ నున్న గొల్లెము జిత్రి
కొప్పుగోసి వెళ్ళ ♦ గొట్టువాడ॥ 148

కం॥ రాయవరంబున నీ క
శ్యాయత గేహంబుగట్టి ♦ యుందుంచెద నీ

వేమొదకుఁ బోకయుండుము
నీయుండనె యుండువాడ ♦ నేనచ్చోటన్॥

తే॥ గీ॥ నావుడు న దిట్టు లనియెను ♦ దేవ! నాకు
నీవు దయదండఁ జిక్కుట ♦ కేవలముగ
సకలసామ్రాజ్య మిచ్చుటె ♦ సంశయంబు
లేదు, సీదాననై యుండు ♦ మోదమునను॥ 150

క॥ నీకం టెలోనిచుట్టము
నా కిచ్చెడు వాడుగలడె? ♦ నానాగతులన్
జేకొని కాపాడుము సుగు
ణాకర! యెన్నటికి నిజేర ♦ నరుగకయుండన్॥ 151

వ॥ అంత నంతకుపురున్న గోతియొద్ద నక్కచందంబున ద్వార బాధమ్ముకడఁ గాచుకొని యున్నవాడు గావున వేంకట సోమయాజి యు దంతయు నాలించి తటుక్కున లోనికిం బ్రవేశించి యిట్లనియె.

క॥ ఇపువినుము చంద్రరేఖా!
భమకముచేనిన్న జేత ♦ బట్టి యెవరినిన్
విషయాలు నీయు గట్టిగ
వృషగా దని పలికె ♦ మింగులభ్రేమదలిర్పన్॥ 153
వ॥ అయ్యవసరంబున.

సీ॥ ప్రాతపుట్టముగట్టి ♦ పూత చెందిర వెట్టి
పాతచెప్పులు మెట్టి ♦ చేతగట్టి
కోల సోలుచు బూని ♦ చాల మధ్యంబూని
ప్రేలుకొంచును, గూను ♦ గ్రాల మోవ

పుండ్ల కిఁగలుఁ బ్రాల ♦ జిడ్డు బొడ్డునఁ దూలఁ
గండ్లపుసులుగార ♦ రొంట్ల బ్రేల
నోర దేఁగుడుగాఱ ♦ యూర బేరముమీఱ
సారె పయ్యెదజాఱ ♦ యూరజేర

గీ॥ దారినెముకను బడబడ ♦ దగ్గుకొనుచు
నపుడు వేంకటసాని నీ ♦ లాద్రిరాజు
గొల్లెనకు నాతులటుపాయ ♦ గొనుచు లోని
కరిగి చేయెత్తి మ్రొక్కి యి ♦ ట్లనుచు బలికె॥ 155

క॥ నీబానిసతో త్రిది; దయ
చే బాసల నిచ్చి చాల ♦ జేపట్టుమికన్॥
గాబాగూబిగ జేయక
నీబంతిని గూడు గుడుపు ♦ నీలాద్రినృపా! 156

వ॥ అనిన నతం డత్యంతసంతోష స్వాంతుండై యట్ల చేసెద నని దానికిం బీతాంబరాదికంబు లొసంగి చంద్రిమె లోకంబుగా మెలంగుచుండె. 157

॥సీ రతిఁ జేసి యలసిన ♦ ధృతి దాని మన్మథా
గారద్రవంబెల్ల ♦ గడిగితుడుచు
నాకుజుట్టి యొసంగి ♦ నది తమ్మలముసేయఁ
దమ్మగ్గి కొని నోర ♦ గ్రుమ్మినములు,
నది మదిర గొనంగ ♦ నది మంచిదేయని
తచ్ఛేషపాల మో ♦ దమునదావ్రివు,

నిదురించు తరిదాసి ♦ పదములు దొడలుగ్రి
కోణంబు సుఖముగా ♦ గ్రుద్ది పిసుకు

గీ॥ మెల్లనే దాని మంచము ♦ నల్లిజంపు
లావుగుబ్బలగంద మ ♦ లంది నిడుద
క్రొమ్ముడిని పూవుకెత్తుల ♦ గూర్చునలపు
గులుకనీలాద్రిభూపాల ♦ మలహారుండు॥ 157

క॥ ఇల్లాలుగక పట్టెరుగక
యెల్లధనము దాని కిచ్చి ♦ యొగ్గును సిగ్గుల్
జెల్లగ దత్వా దద్వయ
పల్లవముల దండ మురిసి ♦ పడి కాపుండెన్॥ 158

తే॥ గీ॥ పుడమిపై గూదలంజెకు ♦ బుడ్డవేశ్య
కాడనెడు మాట చంద్రరే ♦ ఖకును నీల
ధరణివరునకు జెల్లెను ♦ దత్కథావి
ధాన మెఱింగిచితిని నీకు ♦ దథ్యముగను॥ 159

తే॥ గీ॥ అనుచు దంబళ వీరభ ♦ ద్రాచార్యమణికి
నంబి నరసింహు డతులితా ♦ నందహృదయు
కమలుఁడై చెప్పి యంతట ♦ సముచితగతి
నతని వీడ్కొని చనె ♦ దేవ ♦ తార్చనకును

క॥ వాచాగోచరముగ భువి
నాచంద్రార్కంబు గాఁగ ♦ హాస్యరసముచే

నా చంద్రరేఖ గథయును
నీ చరితయుఁ జెప్పినాఁడ ♦ నీలనృపాలా॥ 162

క॥ ఈ కృతికి సమముగాఁ గృతి
నే కవులును జెప్పజాల, ♦ రిది బిరుదము; భూ
లోకము రాజుల లోపల
నీకు దొరకె హాస్యలీల ♦ నీలనృపాలా॥ 163

చ॥ ధరణియు మేఘమార్గమును ♦ దారలు దామరసాప్తచంద్ర ది
క్కరటిగిరీంద్ర శేషఫణి ♦ కంథికిటీశ్వరకూర్మ నాయకుల్
స్థిరముగ నెంతకాలము వ ♦ సింతురు, తత్క్రియ నీ ప్రబంధ ము
ర్వర సరసోత్తముల్ కవులు ♦ వర్ణనసేయగ నుండు గావుతన్॥

క॥ చేటీ వధూటికాకుచ
కోటీసంలబ్ధవిపుల కోమలపంకో
త్పాటనకర నఖర! నీ
శాటోపమఘోరరూప ♦ యార్భదురూపా॥ 165

స్రగ్విణి॥ రాచి రాజాన్వయా! రామ దావానలా!
యాచకాస్తోకమేఘౌఘఝుంఝానిలా!
నీచవారాంగనా నిత్యరత్యాదరా!
పాచకాధార! నిర్భాగ్య దామోదరా॥ 166

## — గద్యము. —

ఇది శ్రీమజ్జగన్నాథదేవకరుణాకటాక్షవీక్షణానుక్షణసంలబ్ధ సరసకవితా
విచిత్ర సలలితాపస్తంబసూత్ర కౌండిన్యసగోత్రకూచిమంచికుల
పవిత్ర గంగనామాత్య పుత్త్ర మానితానూన సమాననానా
విధరంగత్రిలింగదేశభాషావిశేషభూషితాశేషకవితావిలా
సభాసురాఖర్వసర్వలక్షణ సారసంగ్రహోద్దామశుద్ధాం
ధ్రరామాయణ ప్రముఖబహుళప్రబంధ నిబంధన
బంధురవిధాన నవీనశబ్దశాసన బిరుదాభిరామ
తిమ్మకవిసార్వభౌమసహోదర గురుయశో
మేదురవివిధవిద్వజ్జనవిధేయజగన్నాథ
నామధేయప్రణీతంబైన చంద్రరేఖా
విలాపం బను హాస్యరస ప్రబంధ
రాజంబునం తృతీయా
శ్వాసంబు
సర్వంబును
సంపూర్ణము.